# గృహలక్ష్మి

స్త్రీల ఆరోగ్యసౌభాగ్యములను పెంపొందించుట
కేర్పడిన సచిత్ర మాస పత్రిక

సంపాదకుఁడు

**డాక్టరు. కే. యన్. కేసరి**

సంపుటము ౧౯]     31 మార్చి 1947     [సంచిక 3




### సాలుచందా మొదలగునవి

ఈ సచిత్రమాసపత్రిక సాలుచందా రు.4-8-0. అర్ధసంవత్సరపు చందా రు.2-8-0. అంతకు తక్కువ కాలపరిమితి చందా పద్ధతిలేదు. విడికాపి రు. 0-6-0 అణాలు. చందాదారులు ఏమాసమునుండియైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వాని విలువమేరకు తపాలాబిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయమూలకము. బర్మాకు రేట్లు ప్రత్యేకము.

### ప్రకటనలు

ముఖ్యముగా స్త్రీలకందీయవలసిన వస్తువులనుగూర్చి ప్రకటించుటకీపత్రిక ఎంతయు అనువైనది. ప్రకటన చార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. కాలుపుటకు తక్కువవైన ప్రకటనలు చేకొనజాలము. రేట్లకొఱకు వ్రాయునది.

### వ్యాసములు వ్రాయువారికి

వ్యాసముల ముఖ్యాశయము స్త్రీజనాభ్యుదయమైయుండవలెను. అవి సంగ్రహముగ నున్న శీఘ్ర ప్రచురణకు వీలగును. ఒకేప్రక్క సిరాతో స్పష్టముగ తప్పులులేక వ్రాయువలెను. భాష గ్రాంధికముగాని, వ్యావహారికముగాని కావచ్చును; రెండును కలిపి వ్రాసిన అంగీకరింపబడవు. వ్యాసముల ప్రకటించుటలో సంపాదకులకు సర్వహక్కులు గలవు. ప్రకటింప నంగీకరింపబడినపుడు మాత్రము రచయితల కట్లు తెలుపబడును. ప్రచురింపబడని వ్యాసములకు తపాలాబిళ్లలు పంపిన వాపసు చేయబడును. విమర్శనార్థము పంపు గ్రంథములు రెండుప్రతులు పంపవలెను. రిప్లైకార్డు వ్రాసిననే బదులివ్వబడును.

### సంచికలు చేరనిచో

సంచికలు చేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలు చేరనివారికి తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లైంటును చేయునది.

### చిరునామా మార్పు

చిరునామాయందు మార్పుఉండుచో ముందుగానే తెలుపవలయును. ఇట్లు తెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము.

### ముఖ్యమైన గమనింపు

చందాదారులుగ చేర్చుకొనుమని వ్రాయు ఉత్తరములు, ఇతరమైన ఉత్తరములు మానేజరు, గృహలక్ష్మి, రాయపేట, మదరాసు అను చిరునామకే వ్రాయవలయును. చెక్కులు, మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు 'కేసరికుటీరం లిమిటెడ్' పేర పంపవలెను.

చెక్కులు మద్రాసు బాంకులపైననే పంపవలెను.

# విషయసూచిక.




ప్రధానవ్యాసం: ఉగాది. ... ... ... 113
ఉగాది సంకీర్తనం. ... ... ... 118
కొత్త బిల్లులు. ... ... ... 122
ఆశయం. ... ... ... 125
మహాబలిపుర యాత్ర. ... ... ... 127
పాకకళ—గృహవైద్యం—బతుకు తెరువు. ... ... ... 129
వీరవనిత. ... ... ... 137
స్త్రీహృదయము— సమస్య. ... ... ... 140
బలిదానం. ... ... ... 142
రేడియో ప్రసంగం. ... ... ... 145
స్త్రీల వాఙ్మయము. ... ... ... 148
శ్రీదేవి నవనీత హృదయము. ... ... ... 149
నవోదయము. ... ... ... 153
బాల క్రీడలు ... ... ... 156
శ్రీదేవి గాయిత్రి—ఆమె అద్భుత లీలలు. ... ... ... 157
సంతోషం. ... ... ... 159
సంపాదకీయములు. ... ... ... 161
శ్రీ సర్వజిత్సంవత్సర 'గృహలక్ష్మి' పంచాంగం ... ... 164
లోకం పోకడలు. ... ... ... 165
స్వీకారము—విమర్శ. ... ... ... 166

# శ్రీ సర్వజిత్ నామ సం॥ చైత్ర వైశాఖమాసములు

1947-వ సం॥ ఏప్రిల్ నెల

| | | |
|---|---|---|
| 1 | మం | ఏ ద 48-22 ఆశ్లే 47-26 ధృ 41-21 వ 21-2 దివి 21-5 మత్రయ ఏకాదశి |
| 2 | బు | ద్వా ద 43-42 మ 44-34 శూ34-39 బ 15-57 దివి 15-55 వామనజయంతి |
| 3 | గు | త్ర ద 40-1 పూ ఫ 42-46 గం 28-44 కౌ 11-46 దివి 3-49 మత్స్యజయంతి |
| 4 | శు | చ ద 37-25 ఉ ఫ 41-57 వృ 23-43 గ 8-38 దివి 0-21 |
| 5 | శ | ○ పూ 36-10 హ 42-26 ధ్రు 19-39 భ 6-43 దివి3-0 మన్మధపూజ |
| 6 | ఆ | కృ పా 36-6 చి 44-7 వ్యా 16-34 బా 6-3 దివి 2-53 రా 28-13 |
| 7 | సో | వి 37-16 స్వా 46-56 హ 14-33 తై 6-36 |
| 8 | మం | త 39-28 విశా 50-33 వజ్ర13-15 వ 8 17 దివి 1-43 పాషండ గౌరీవ్రతము |
| 9 | బు | చ 42-40 అనూ 55-41 సి 12-50 భ 11-0 దివి 1-32 సంకష్ట గణేశవ్రతం |
| 10 | గు | పం 46-37 జ్యే 60-10 వ్య 13-4 కే 14-34 దివి 10-54 |
| 11 | శు | ష 51-4 జ్యే 1-17 వర్య 13-46 గ 18-46 దివి 23-18 |
| 12 | శ | స 55-44 మూ 7-12 వర్య13-46 గ 18-46 దివి 23-18 |
| 13 | ఆ | అ 60-10 పూ షా 13-14 శి 15-52 బా 28-1 రా 4-23వ |
| 14 | సో | అ 0-19 ఉ షా 19-7 సి 17-5 కే 0-19 దివి30-4 వరాహ జయంతి |
| 15 | మం | న 4-33 శ 24-38 సా 17-33 గర 4-33 రా 4 33 |
| 16 | బు | ద 8-6 ధ 29-27 శు భ 8-10 భ 8-8 రా 17-47 |
| 17 | గు | ఏ 10-54 శ 33-27 శు 17-16 బా 10-56 రా 19-19 |
| 18 | శు | ద్వా 12-41 పూ బ 39-23 బ్రి 15-59 తై 12-43 త్యాజ్యంలేదు. |
| 19 | శ | త్ర 13-16 ఉ బా 38-10 ఐ 13-47 వ 13-18 ది 1-1 |
| 20 | ఆ | చ 12-10 రే 38-42 వై 10-36 రకు 12-38 ది 8-22 |
| 21 | సో | ● అమా 10-44 అ 38-0 విష్క 6-30 నా 10 43 ది 28-10 అమావాస్య |
| | | వైశాఖ మాసము. సోమవారవ్రతం |
| 22 | మం | శు పా 7-38 భ 36-11 ప్రి 1-27 బ 7-41 ది 1-12 తదియ సౌభాగ్య గౌరీవ్రతం] |
| 23 | బు | వి 3-29 కృ 33-17 సౌ 48-44 కే 3-31 ది 4-40 [పరశురామజయంతి అక్షయ |
| 24 | గు | చ 52-37 రో 29-41 శో 41-26 వ 25-30 ది 10-50 |
| 25 | శు | పం 46-14 మృ 25-30 అతి 33-24 బ 19-23 రా 13-40 శంకర జయంతి. |
| 26 | శ | ష 39-43 ఆర్ద్ర 12-0 సు 25-20 కే 12-52 రా 17-20 |
| 27 | ఆ | స 33-11 పు 16-24 ధృ 17-2 గ 6-20 రా 3 46 గంగా జయంతి. |
| 28 | సో | అ 27-3 పు 12.8 శూ 9-27 విష్క 0-4 రా 10-50 |
| 29 | మం | న 21-30 ఆశ్రే 8-16 గ 2-4 కే 21-1 రా 5-30 |
| 30 | బు | ద 16-43 రు 5-13 ధ్రు 48-56 గ 16-43 ది 24-30 |

## ఉగాది అభివందనములు.



# గృహలక్ష్ముల లలితకళాశోభను

* సౌందర్యమును
* సౌభాగ్యమును
* సౌజన్యమును
* సౌశీల్యమును

సామర్థ్య సంతోషములను

లలితకళాసమన్వితమైన గృహనిర్మాణమును

నిరంతరము ఆశించు

 గృహలక్ష్మి 

## అభివందనములు



# ఉగాది పిలుపు



" గృహలక్ష్మికి మాయింట్లో హారతియిస్తాం పేరంటానికి............ "




జయజయ గృహలక్ష్మి సఖి! జయజయ లలితాంధ్ర మధుర సారస్వతిమా!
జయజయ లలనారత్నమ! జయజయ విద్యాప్రబోధ! జయ కల్యాణీ!

## ఉగాది.

ఈ మార్చి 23 వ తేదితో వ్యయనామసంవత్సరం అంతంకాగా సర్వజిత్ నామ సంవత్సరం ప్రారంభం అవుతున్నది. కాబట్టి ఆంధ్ర దేశమంతటా, ఆంధ్రులైన వారున్నచోట్ల నెల్లా సంతోషముతో ఉగాదిపండుగ చేసుకుంటారు. ఉగాదికి ఆంధ్ర దేశంలో ఏ మూల చూచినా కొత్తచింతపండు కొత్తమిరపకాయలు, మల్లెపూలు, తేనెపట్లు, వేపపూత, మామిడి కాయలు, చెరకు గడలు, తాటిముంజలు—ఇట్లా ఎన్నో వేసవిలోనే లభ్యమయ్యే అనేక కొత్తవస్తువులు విస్తారంగా దొరుకుతవి. పాత సంవత్సరం పోయి కొత్తసంవత్సరం రాబోతున్నదనే ఊహకు కేంద్రము ఉగాది పండుగ. కాబట్టి ఆనాడు ఆంధ్రులంతా కొత్త ఊహలతో, కొత్త ఆశలతో, కొత్త రుచులతో, కొత్తప్రయత్నాలతో అన్నిటా కొత్త గోరుతూ అభ్యంగన స్నానాలుచేసి, కొత్తగుడ్డలు కట్టి, వేపచేదుమ్రింగి, పంచభక్ష్య పరామాన్నాలతో, ఇష్టబంధువులపంక్తిని విందారగించి—"సంవత్సరాదిని జరిగినపని సంవత్సర మంతా జరుగుతుంది" అనే లోకోక్తిని నమ్మి—శుభవస్తువుల సేకరించడం, శుభకార్యముల తలపెట్టడం, సుఖసంతోషముల నోల లాడడము, అనేవి జరుపుతూ, ఆనందంతో ఉగాదిపండుగ చేసుకుంటారు.

పాతకొత్తల సంధ్యయే ఉగాదిపండుగ. పాత అనుభవాల దిగమ్రింగి, క్రొత్త కాశ పడడము, మానవనైజము. అయితే పాతదానిని విమర్శదృష్టితో పరికిస్తేనే కొత్తదానికి సుగమమైన మార్గాలు కన్పించేది. అందుచే పాతవిషయాలు ఇంచుక ప్రస్తావిస్తాము, కొత్తలు సూచిస్తాము.

వ్యయనామ సంవత్సరం ప్రారంభమైయే నాటికి అప్పుడే కొత్తయెన్నికలు ముగిసి మనరాష్ట్రంలో కొత్త మంత్రివర్గం ఏర్పడబోతున్నది. ఎంతో రాద్ధాంత సిద్ధాంతాలైన మీదట ప్రకాశంగారి మంత్రివర్గం ఏర్పడినది. వీరినిగూర్చి ప్రథమంలో సంశయగ్రస్తులైన గాంధీగారికికూడా మెప్పుగా ఈమంత్రివర్గం కార్యక్రమం నడిపినది. కాని ఆమంత్రివర్గాని కండమైన పార్టీలో మాత్రం, ఐకమత్యం లేకపోవడంవల్ల, ఏర్పడేనాడు ఏస్థితిలో ఉండెనో ఆస్థితిలోకి తిరిగివచ్చిం దామంత్రివర్గం నేడు. అధికస్య, విశేషమేమిటంటే, విరోధివర్గాలతో మంత్రులూ కొందరు చేరారు! అధికసంఖ్యాకులు మంత్రివర్గంలో విశ్వాసం లేదన్నారు. మంత్రు లందరు రాజీనామా లిచ్చారు. నాడు హైకమాండు నెదిర్చిన సభ్యులు, వారెన్నుకొన్న ప్రధాని అందరూ హైకమాండుకు శరణాగతుల మన్నారు. ఈసంవత్సరాంతంలో క్రొత్త నాయకుని ఎన్నిక జరుగబోతున్నది. సర్వజిత్ నామ సం॥ ఉగాదినాటికి కొత్తప్రధాని, క్రొత్తమంత్రులు.

ఈ ఎన్నికలలో ఆంధ్రదేశంలో స్త్రీల కేర్పడ్డ ప్రత్యేక స్థానంగాక, జనరల్ స్థానాలలో శ్రీమతులు వల్లభనేని సీతామహాలక్ష్మమ్మ, భూపతిరాజు రాజ బంగారయ్యమ్మగార్లు ఎన్నుకోబడ్డారు. ఈ సందర్భమున పురుషుల ఔదార్యము మెచ్చుకో దగినదే. అయితే ఈ ఔదార్య మిట్లే పెంపొందితే, జనాభాలో సగమైన స్త్రీలకు న్యాయంగా చెందవలసినన్ని స్థానాలు క్రమంగావారికి లభ్యంకాగలవు అని మా విశ్వాసము. వీరిరువురిలో బంగారయ్యమ్మగారు భీమవరంతాలూకాలో ఉత్తమ క్షత్రియవంశ సంజాత మైన ఇల్లాలు. సామాన్యముగ ఆవంశాలవారు ఘోషాపద్ధతి నవలంబిస్తుంటారు. కావున ఆమె యిట్లా శాసనసభా సభ్యత్వమర్థించి అంగీకరించడం గొప్పవిశేషము. మంత్రివర్గంలోను శ్రీమతి ఆచంట రుక్మిణీ లక్ష్మీపతిగారి నొక్కమంత్రిణిగా గైకొన్నారు. ఆమెయున్నా మిగత మంత్రుల కేవిధంగాను తీసిపోకుండా తనపరమైన శాఖల నడుపుతూ యున్నారు. శ్రీమతిఅమ్మన్నరాజాగారున్నూ అస్సెంబ్లీకి డిప్యూటీ స్పీకరై, అవకాశ మొదవినపుడెల్లా

సామర్థ్యంతో సభాకలాపం నడిపిస్తూ యున్నారు. లెజిస్లేటివ్ కౌన్సిలు ఎన్నికల్లో ఎవ్వరున్నూ స్త్రీలు రాకపోయినా, శ్రీగవర్నరుగారు శ్రీమతి క్లబ్‌వాలాసతిగారిని సభ్యురాలినిగా నియమించినారు. అదియు కాలపరిమితి ముగిసిన పూర్వసభ్యులగు శ్రీ సర్. కట్టమంచి రామలింగారెడ్డిగారి స్థానమున అనగా స్త్రీలెంత గర్వింపదగిన హాంశమో చెప్పనక్కరలేదు. నూతన మంత్రివర్గపు మార్పులలో ఎవరు మారినను ఎవరు మారకున్నను మంత్రిణిగారిని మార్చరాదని మా కోరిక. ఒకవేళ మార్చకతప్పని సరియైనను ఆస్థానమున మరియొక స్త్రీసభ్యురాలినే మంత్రిణిగా నొనర్చుట చెల్లునని మా అభిప్రాయము. ఒక్కరుగాదు; ఇంక నెక్కువగానే మంత్రిణు లేర్పడవలయునని మా అభిలాష.

కేంద్రశాసనసభలోను, ఇతర రాష్ట్రములలోను స్త్రీల విషయమై తేబడిన ప్రత్యేకపు బిల్లుల నిదివరకే ప్రస్తావించి యుంటిమి. మన రాష్ట్రమునగాక ఒక్క యు. పి. రాష్ట్రముననే స్త్రీ మంత్రిత్వము వహించియున్నది. మరి యొకటిరెండు రాష్ట్రములలో స్త్రీలు పార్లమెంటరీ కార్యదర్శినులై యున్నారు. ఒరిస్సాలో అరమరికలు లేక ఒక్క పోలీసు ఉద్యోగములు తప్ప మిగత అన్ని యుద్యోగములును స్త్రీల కొసంగబడునని ప్రభుత్వము వారు ప్రకటించియున్నారు. మద్రాసు ప్రధాని పోలీసుశాఖలో సహా స్త్రీలను చేర్చుకో వచ్చంటున్నారు.

గత ఉగాదినాటికే ఇంగ్లాండునుండి కాబినెట్ మిషన్‌వారు విచ్చేసి మనదేశమున కార్యోన్ముఖులై యుండిరి. వారి కార్యసరళినిగూర్చి, తత్పరిణామమును గూర్చి ప్రథమ సంచికయందలి పునరాగమనంలో వివరంగా ప్రస్తావించి ఉన్నాము. అందులో పేర్కొన్న చిక్కులట్లే ఉన్నవి. ఎన్నటికి వీడునో తెలియరాకున్నది. కాని ఈలోపల జరిగిన విశేషములు మాత్రము విలక్షణమైనవి. కాబినెట్ మిషన్ ప్రణాళికనుగూర్చి కాబినెట్ వారు వివరించినమీదట కూడ ముస్లింలీగువారు భీష్మించుకొని కూర్చోగా అట్లీ ప్రధాని మరియొక ప్రకటనగావించినాడు. అందు 1948 జూన్ నాటికి బ్రిటిష్ అధికారము పూర్తిగా ఉపసంహరించు కొందుము అని స్పష్టపరచిరి. అయితే అధికారము నెవ్వరి పరము గావింతురనునది కొన్ని సందిగ్ధవాక్యముల తెల్పిరి. ఏక కేంద్రమున కంగీకరింపని

రాష్ట్రములున్నచో వానిరాజ్యాధికారములను ఆరాష్ట్రప్రభుత్వములకే అప్పగిస్తామనే ఆశ కల్పించిరి. దానితో పాకిస్థానము రాష్ట్రములలో ఎట్లైనా ముస్లింలీగు రాజ్యము స్థాపనచేతామని లీగువారు గిల్లికజ్జాలు రేపుతున్నారు. పైప్రకటన వెంటనే, ప్రస్తుతమున్న వైస్‌రాయిగారిస్థానే రాజబంధువగు మౌంట్‌బాటన్ ప్రభువును కొత్తవైస్‌రాయిగా నియమించినారు. ఆయన ఈ ఉగాదినాటికి విచ్చేసి వ్యవహారములన్నియు చక్కబరచును అని అంటున్నారు. అయితే ఈ కాబినెట్ మిషన్‌వారి కృషిఫలితంగా భారత స్వతంత్ర రాజ్యాంగధర్మ నిర్ణయసభ యేర్పడి, లీగు బహిష్కరించినా పనిసాగిస్తూ ఉన్నది. ఆ సభలో మన రాష్ట్రమునుండి శ్రీమతులు దుర్గాబాయి, అమ్ము స్వామినాథన్ మున్నగు స్త్రీలును సభ్యురాండ్రైయున్నారు. ఇతర రాష్ట్రములనుండికూడా శ్రీమతులు రాజకుమారీ అమృతకుమారి, సరోజినీదేవి, విజయలక్ష్మీపండిట్ మున్నగు నారీమణులును సభ్యురాండ్రై యున్నారు. వీరిలో కొందరు ముఖ్యమగు ఉపసంఘములలోకూడ సభ్యురాండ్రైనారు.

ముస్లింలీగువారు వివిధరాష్ట్రముల రాజకీయోద్దేశములతో లేవదీసిన అల్లరులలో స్త్రీలను హింసపెట్టుటయు, మానభంగమొనర్చుటయు పరిపాటియై పోయినట్లున్నది. బంగాళములో జరిగిన గాథలకన్న దారుణముగా పంజాబులో జరుగుచున్నవని శ్రీసర్‌దార్ బలదేవసింగు గారనుచున్నారు. ప్రభుత్వమును ప్రజలును ఇట్టివి ఇకజరుగకుండ కట్టుదిట్టములు గావింపవలసిన అగత్యము తటస్థించినది. ఏమైనను స్త్రీలు తమ్ముతాము రక్షించుకోజాలనిదే భగవంతుడైన రక్షింపజాలడు.

పోయిన సంవత్సరాదినాటికి యుద్ధము ముగియగా ప్రారంభమైన శాంతిస్థాపన ప్రయత్నము లింకను పూర్తికాలేదు. వానిమందగతి చూస్తే త్వరలో అవుననేసూచన కూడా కన్పించడంలేదు. రాజకీయ వేత్తలకు హెచ్చరికగాను, వారు నిర్మించు శాంతి సూత్రములు చిరస్థాయియగుటకును, ఆశాంతి సభకొక విజ్ఞానవేత్తల ఉపసంఘమేర్పడినది. దానికి శ్రీ సర్. యస్. రాధాకృష్ణన్‌గారధ్యక్షులు. వారికి శ్రీమతి రాజకుమారి అమృతకౌర్‌గారు అన్నివిధముల సహాయము చేస్తున్నారు.

గతసాలున ఎందరో ప్రముఖులు కీర్తిశేషులైరి. వారిలో స్త్రీలకొరకు పనిచేసినవారు నున్నారు. అట్టి వారిలో ముఖ్యులు: సంఘసంస్కరణ పరాయణులు శ్రీనివాసశాస్త్రిగారు;

నాటకరంగమున స్త్రీలు స్త్రీపాత్రధరించ వలయునని ప్రకటించి అందుకై కృషిచేసి కొంత వరకు కృతార్థులైనవారు శ్రీ బళ్లారి రాఘవాచార్యులుగారు; శ్రీమతి కాంచనమాలా ఇత్యాది అజ్ఞాతకన్యల వెండితెరపైకి రప్పించి ప్రసిద్ధలనొనర్చినవారు శ్రీగూడవల్లి రామ బ్రహ్మంగారు; స్త్రీలకొక జాతీయవిద్యాలయము నెలకొల్పి నడిపినవారు సర్. శివస్వామి అయ్యర్ గారు; అనేక దానధర్మములొనర్చిన వితరణశాలిని శ్రీజగ్గంపేట జమీందారిణి గారు; జీవితమంతయు దేశసేవకు ధర్మసేవకు అర్పించిన పుణ్యమూర్తి మాళవ్యా. వీరందరి యెడలను స్త్రీలు నిరంతరము కృతజ్ఞులై యుండదగును.

వ్యయనామ సంవత్సరము నందంతయు మనరాష్ట్రప్రజలు ఆహారమునకు ముఖ్య వస్తువగు బియ్యముచాలక, కట్టెలు కరవై, గుడ్డదొరకక, అగ్గిపెట్టెలులేక, పప్పులుతక్కువై, కిరసనాయిలు క్లుప్తమై,చక్కెరలోపించి, కొబ్బరినూనె లభించక చాల బాధపడ్డారు. ఇవన్నియు ముఖ్యముగా ఇల్లాండ్రు, గృహ కృత్యములను సరిగా నెరవేర్చుట కవసరమైనవి; నిజాలం కారమునకును ఇందు కొన్ని ముఖ్యావసరములైనవి. కావున నిజమున కీవస్తువుల కరువుబాధ హెచ్చుగావారిదే. అయిన నీసంవత్సరము వరిపంట హెచ్చగుటచేత బియ్యము క్రమముగా చాలినన్ని దొరకవచ్చును. మిగత పదార్థములున్నూ, పుష్కలముగా లభింపవచ్చును. ఏమైనను ముఖ్యముగా స్త్రీలు "దొంగవర్తకము" ను ప్రోత్సహించుటకు నిరాకరించుచో, అన్నియు ఉన్నంతలో అందరికి లభింపవచ్చును. ఇందు వస్త్రసమస్య తీరుటకు స్త్రీలెంతో పని చేయడాని కవకాశమున్నది. మిల్లుల నాదరించువారును, మిల్లుల నిరాకరించువారును, ఉభయులున్నూ, ఇప్పుడు తీవ్రముగా రాట్నపరిశ్రమ సాగినగాని గుడ్డలకరువు అంతరించదు, అని చెప్పుచున్నారు. ఆపని హెచ్చుగా చేయగలవారు స్త్రీలేకదా.

ఎన్ని తుపానులు వచ్చినను సంసారయాత్ర, అట్టి సంసారములతో గూడిన ప్రపంచవు నడక, సుఖముగా సౌకర్యముగా సాగవలెనంటే, ధైర్యసాహసములుగల్గి, దీక్షాదక్షతలుకలిగి, ఓర్పు, నేర్పులతో సర్దుకొనిపోయే గృహలక్ష్మిదే ఆధిపత్యత. ఈ సర్వజిత్ నామ సంవత్సరము "గృహలక్ష్ములకు" కు అట్టి శక్తి యుక్తులనిచ్చి పేరు నిలుపుకొనునని ఆసిస్తున్నాము.

మంగళం మహా శ్రీ శ్రీ శ్రీ.

---

# ఉగాది సంకీర్తనం.

## సర్వజిత్తు

సమరస శాంతి దిగ్జయము శాశ్వత కీర్తుల వృద్ధిఁ గాంచఁగా
యమ నియ మాది సాధనలె యార్యత నిల్పి జగాల నేలఁగా
విమల విచిత్ర శాస్త్రములు విశ్వ జయంబులఁ గూర్చు చుండఁగా
అమరత సర్వజిత్తు సక లార్థము లిచ్చుచు బ్రోఁచుఁ గావుతన్.

శ్రీవిజయమ్మ విద్దెల నశేష నయోన్నత రాజ్యలక్ష్ములన్
వావిరి గూర్ప సర్వజితు పందెము వేయఁగ వచ్చి నిల్చె స
ర్వావయవ స్వరూపమగు నార్థిక మానసి కాభివృద్ధులన్
పావన రీతి నిచ్చునని పండితులందురు సత్యవాక్కులన్.

ఇంతుల హక్కులెల్ల నిఁక హెచ్చుగ నన్నిటఁ గూర్ప నెంచి తా
వంతున వచ్చు సర్వజితు వంది కృతోన్నత వర్ణనంబులన్
మింతు నటంచు నెంచినది మిన్నల మిన్న యిదేమి జిత్తులన్
గంతులు వేయునో యెఱుఁగఁ గాలవిభుండు సమర్థుఁడే సుమా!

వ్యయమునఁ గష్ట మొందిన ప్రపంచక మంతను సర్వజిత్తు తాన్
అయము జయంబుతో నిడి యిహాన బరంబున సౌఖ్యసంపదన్
రయమునఁ గూర్ప సిద్ధమయి ప్రాభవ మొప్పఁగ శ్రీలసంస్థలన్
నయ జయ హారతి ప్రకర నవ్య పదంబుల నిల్పుఁ గావుతన్.

పైరులు పచ్చలున్ నిలిపి బట్టను తిండిని పుష్కలంబుగా
తీరులు తీర్చి దిద్ది బహు దేశము లేలఁగ సర్వజిత్తు సం
స్కారము శ్రీలకిచ్చి నయ కర్మ వచః పరిణామకీర్తులన్
పౌరుష మెల్లెడన్ వెలుఁగ భాగ్యము భోగ్యముఁ గూర్చుఁ గావుతన్.

చేబ్రోలు సుబ్రహ్మణ్య శర్మ.

జిత్తు శబ్దమ్ము విన్న నాశించు భయము
సర్వజిత్తు మఱొండు సాక్షాత్కరించె
జిత్తులం దెందు నెప్పుడుఁ జిక్క కుండఁ
గీర్తినిం బొందుమ! గృహలక్ష్మి లలామ!

చదలువాడ నాగరత్నమ్, వరసత్యాల్లూరు.

# సర్వజిత్స్వాగతము.

సర్వజి ద్వత్సర స్వాగతంబివ్వగ తరలి పోదము రండు తరుణులార
స్వారాజ్య పథకము సరస చేపట్టును స్వాగత మివ్వరే సాధ్వులార
భారతాంగనలను భవ్యంబు గూర్పగఁ నదిగో వచ్చెను బిల్వ నఱుగుదమ్మ
హైందవస్త్రీల దుస్థితి హరింపగ వచ్చె హారతు లివ్వరే యతివలార!

కంటిరే! భాగ్యదేవత! కన్నులార
వింటిరే యామె కీర్తనల్ వీను లలర
బ్రహ్మ పాత్రికి సాటి యేబ్రహ్మమందుఁ
గన్న లేరంచు నమ్మి స్వాగతము లిండు.

ఉర్వి గల ప్రాణు లెల్లను
శర్వుని వలె గాచు మమ్మ సర్వజిత్తనుచుఁ
సర్వులు నిను గొని యాడగ
పర్వున రావమ్మ నింక పద్మదళాక్షీ.

శాంతి సమరంబు సేయంగ శక్తినిచ్చి
సామ్యవాదుల నుత్సాహ కాంతిగూర్చి
సర్వ సౌభ్రాతృ భావముల్ జక్కఁజేయు
సర్వజి ద్వత్సరమ నీకు స్వాగతంబు.

చల్లగా మెల్లగా కథల్ సాగనిచ్చి
భారతాంగనలకుఁ గల్గు బాధ మాన్పి
ఆదరింపగ వచ్చెడి అమరజ్యోతి
స్వాగతం బమ్మ సర్వజిత్ సౌఖ్యరాశి.

ప్రజల సంరక్షణార్థమై బ్రహ్మపాత్రి
సర్వజిత్తనునామంబు సరస దాల్చి
సకల సౌభాగ్య మివ్వగ సాగి వచ్చె
హాయిగా బాల బాలికల్ ఆడుడింక.

తెన్నేటి వసంతమ్మ
పచ్చిక పల్లం.

—(o)—

## నవయుగాది

ఇదే ఇదేరా
నవ యుగాది;
తెలుగు వారల
తొలి జగాది.

నవ నవోజ్జ్వల
తెలుగు భానుని
ప్రత్యుషస్సుల
తెల్గు జ్యోతులు
ప్రతిఫలించే
నవ యుగాది.
ఇదే ఇదేరా
నవ యుగాది;
తెలుగు వారల
తొలి జగాది.

ఈ భయంకర
పాడు జగతిలో
అస్వతంత్రపు
తెలుగు తల్లి
అశ్రు కణములు
యేరులై పెను
వాగులై ప్రవ
హించినట్టి వి
షాద దినములు
గడచి పోయెను
గడచి పోయెను.
ఇదే ఇదేరా
నవ యుగాది;
తెలుగు వారల
తొలి జగాది.

తెలుగు అలుగుల
వెలుగు వెన్నెల
మెఱుపులందున
తెలుగు జోదుల
కీర్తి కాంతులు
ప్రజ్వలించే
వెల్గు క్షణములు
అదిగో అదిగో
అంకురించెను
ఇదే ఇదేరా
నవ యుగాది;
తెలుగు వారల
తొలి జగాది.

పాల తరగల
సుధల నురుగుల
విరుల సిరుల
మధు స్రవంతుల
తెలుగు లోకము
తేలి పోయే
మధుర గడియల
తొలి దినంబిది
ఇదే ఇదేరా
నవ యుగాది;
తెలుగు వారల
తొలి జగాది.

తెలుగు తోటలో
లతల చాటులో
తెలుగు కోయిల
గాన లహరుల
మెలిక లందున
పొంగి పోయే

రాగ సుధలను
తెలుగు సంతతి
అనుభవించే
మధుర ప్రకృతి
ఇదే ఇదేరా
నవ యుగాది;
తెలుగు వారల
తొలి జగాది.

పాల జ్యోత్స్నల
మధుర యామిని
క్షణము లందున
పొదల మాటున
విరుల చాటున
తెలుగు చిలుకల
జిలుగు పలుకుల
తేనె జల్లుల
తీపి గ్రోలే
మధు క్షణంబుల
మధుర దినమిది
ఇదే ఇదేరా
నవ యుగాది;
తెలుగు వారల
తొలి జగాది.

మలయ మారుత
పవన వీచిక
చలువ దనమున
తెలుగు యోధుల
కదన బడలిక
తరలి పోయే
మృదుల ప్రకృతి
ఇదే ఇదేరా
నవ యుగాది;
తెలుగు వారల
తొలి జగాది.

పారతంత్ర్యము
పారిపోయెను
నిరంకుశము
మంట గలసెను
బెదరు వదరులు
చెదరిపోయెను
తెలుగు జగముస్వ
తంత్ర తేజము
తెలుగు సీమస్వ
తంత్ర రాష్ట్రము
చాటు కోరా
నీ స్వతంత్రత
చాటు కోరా
విజయ ఢంకా
నిలుపు కోరా
తెలుగు వెలుగు
లేదురా యిక
బానిసత్వము
కాదురా యిది
పిరికి దేశము
నాది యనరా
తెలుగు దేశము
ఏదిరా? నీ
ఆంధ్ర శక్తి
ఇదే ఇదేరా
నవ యుగాది;
తెలుగు వారల
తొలి జగాది.

కె. సభా
చిత్తూరు.

—(o)—

# కొత్త బిల్లులు.

## భోగం మేళాల నిషేధం.

### (1)

భోగం మేళాల నిషేధాన్ని గూర్చి శ్రీమతి. వల్లభనేని సీతామహాలక్ష్మమ్మగారు ప్రవేశ పెట్టిన బిల్లు వివరాలు, గృహలక్ష్మి లోప్రచురించారు. అందుపై ఆక్షేపణలు, ఆమోదాలుకూడా ప్రచురింప బడ్డాయి.

అవివాహిత స్త్రీలు నృత్యగీతాలు నేర్చుకొని వ్యభిచార వృత్తికి గురిఅవుతున్నారని యీబిల్లు ప్రవేశ పెట్ట బడిందిట, ఇంతకూ- నిషేధందేనికి ?

భోగంవాళ్లనా? మేళాన్నా ?? లేక, నాట్యాన్నా???

ఆచార వ్యవహారాల్లో కూడా స్త్రీలు లేని పోని వేషాలు వేస్తుంటే "భోగంవేషాలు వేస్తావ్, జాగ్రత్త!" అని పెద్దల మందలింపు వింటూ వుంటాము. ఆకట్టు, జుట్టు, బొట్టు, ఆభరణాలు, టక్కులు, టమారులు శృతిమించి రాగాన బడితే సంసార స్త్రీలని 'భోగందాని లాగ' అని అంటూ వుంటారు.

ఇక మద్దిళ్లు, తాళాలు, వాయిద్యాలుతో గూడి, గజ్జెకట్టుకుని ఆడే స్త్రీ సమూహాన్ని కూడా మేళం అంటారు. బోగంవాళ్లు ఆడితే బోగంమేళం అన్నారు. ఈమేళాల అంతర్యం ప్రధమంలో ఎలాగున్నా రాను రాను వివాహాల్లోనూ, శుభకార్యాల్లోనూ, పర్వదినాల్లోనూ వచ్చే సభికులను రసికులను గాజేసి వశవరచుకుని-వీలైనంత మందిని-వాళ్లని మట్టం చేసేందుకు ఎరకింద తయారైనవి. మేళం 5-రోజులు రాత్రిం బగళ్లు ఆడితే ఆంత జట్టుమీద ఒక్కొక్కరికి రూ 50/లు కన్నరాబడి కష్టం. అయితే మేళంఅనే మిష పురస్కరించుకుని కొత్త ఆస్తి పాస్తులన్న వాళ్ల యిల్లు, ఒళ్లు గుల్ల చేయడానికి కారణ భూతులు అవుతున్నారు. ఇక వాళ్లుచేసేది నాట్యమంటారా? నమస్కారం!

నాట్యం ఎలాంటి వాళ్లు నేర్చుకోవాలి అనేది అభినయ దర్పణంలో స్పష్టంగావుంది. నాట్యంయొక్క ఆశయ మేమిటి? అధ్యాత్మిక దృష్టితో తరంగా ష్టపదులు నాట్య, నృత్య, నృత్త, లాస్య, తాండవ ములలో ఆడి, పాడి, ఆపరమేశ్వర సాన్నిధ్యానికి చేరేందుకు ఒక సాధకం. అధమం నవరసాల్ని హావభావాలతోటీ నృత్య గీతాలతోటీ ఒప్పించి సభికులను ఆనందింప జేసి ఆనర్తకులు అనందించడం.

ఆధ్యాత్మిక రీత్యా శాస్త్రరీత్యా అక్షరాల ఆచరించేవారు, మోక్షం పొందేవారూ లేకపోయినా ఆనందాన్నైనా కలిగించాలి.

ఇంతకీ యీనాట్యంమొదట్లో దేవదాసీలు అని ప్రత్యేక తెగవారు ఆచరించి దేవాలయల్లో భగవ స్సాన్నిధ్యమున పవళింపుసేవ,ప్రభాతసేవ మొదలగునవి చేస్తూ జీవితం గడిపేవారు. రాను రానూ దేవదాసీలు భక్తులు శృంగార చేష్టలకులోనై పరిస్థితులు విషమిస్తూ వచ్చాయి. క్రమేపీ దేవాలయాల్లో దేవదాసీల ప్రమేయం లేకుండా పోయింది.

ఈమధ్య విజ్ఞానంతో గూడిన, యువతీ యువకులు, పెద్దకుటుంబాల వాళ్లు నాట్య విద్యను అభ్యసించి చక్కని ప్రచారంలోకి తీసుకు వస్తున్నారు. చదువు, సంగీతం, చిత్రలేఖనం ఏవిధంగా నేర్చుకుం టున్నారో నాట్యకళను కూడ ఆవిధంగానేర్చుకుంటూ భరతనాట్య ప్రదర్శనాలు యిస్తున్నారు.

అది అలాజరుగుతుండగా 'భోగంమేళాల నిషేధం' అని ఈమధ్య ఒక పెద్ద దుమారం రేగింది. అది భోగంవాళ్లు కనిపెట్టి, మేళం, అని మానేసి, వారు నాట్యం అనిపేరు పెట్టి రంగస్థలాలమీదికి వురికారు. దాంతోటి భోగం నాట్యంకూడా భరత నాట్యం క్రింద జమకట్టి ప్రదర్శనాలు జరుగు తున్నాయి. నాట్యకళమీద కొంత అసహ్యత కలిగించారు.

వ్యభిచారం! స్వతస్సిద్ధంగానూ, సహవాస దోషంవల్ల కొందరికి సంక్రమించే దుర్గుణాల్లో యిదొకటి. ఆవిధంగా పాడై పోవడానికి నాట్యంనేర్చుకోవడమే కారణం అవనక్కరలేదు. నాలుగు గోడల మధ్య కట్టుబాట్లల్లోవుంచబడిన కొంతమంది సంసారస్త్రీల చరిత్రలు చిత్రవిచిత్రాలుగా వింటున్నాం. ప్రత్యేకంగా ఆదేవృత్తికోసం బ్రతుకు తున్నారా అనే, అనుకునే, భోగంవాళ్లు, సానులు వివాహాలు చేసుకొని పండు వంటి సంసారాలు గడుపుతున్న వాళ్లని చూస్తున్నాం.

అందుచేత వ్యభిచారాన్ని నిషేధిస్తామంటారా? బ్రహ్మ తరంకాదు. ఆబుద్ధి పుట్టకుండానే వుండాలి గాని, పుడితే పుడకల్లోటేసమాప్తి.

చెడుని రూపుమాప వలసిన బాధ్యత వ్యక్తులమీద, సంఘంమీద, పరిపాలకుల మీద, ప్రజలమీద అందరి మీదవుంది. కాని ఇదిమాత్రం, 'వృత్తి' అనేది మాన్పించ గలిగినా, 'బుద్ధి' మాన్పించ లేరు.

ఇటువంటివి కాలానికి, ప్రకృతికి, పరిస్థితికిలొంగి బుద్ధిమార్చుకోవాలి, బుద్ధి మారాలిగాని, మానవ ప్రయత్నాలవల్ల, బిల్లులు, చట్టాల వల్ల అవడం కష్టం.

భోగం వాళ్లుకూడ, వాళ్లవృత్తిలో వున్నలోపాలను గ్రహించి కాల మాన పరిస్థితులను బట్టి సంసారులై, మానవులగుదామని ప్రయత్నిస్తున్నారు. చాలామట్టుకు ప్రయత్నించారు.

ఇక- నాట్యం ఎవరు ఆచరించినా, నాట్య శాస్త్రాన్ని చదివి, అర్థంచేసుకుని, ఆచరించి, ప్రదర్శించి నాట్యకళను ఆరాధించి జన్మ.చరితార్థము చేసుకుంటే అదే పదివేలు.

కళకి కళంకము తీసుకు రాకండి. శ్రీమతి వారిబిల్లు ఆశయం మంచిదేగాని ఎంత వరకు ఆచరణీయమో పెరుమాళ్లకెరుక.

శ్రీ రామాచార్యులు, 'నర్తనశాల', మద్రాసు.

**(2)**

ప్రస్తుతం ఆడబడుతూవున్న భోగంమేళాలలో శాస్త్రీయమైన నృత్యగానములు కానరావు. బూతు పాటలు, గంతులాటలు తప్ప "లలిత కళ" ఏమీ కనబడదు. సభ్యతగలవారు ఇది గ్రహించి ఇదివరకే, వాటిని నిషేధించారు. ఒకవేళ "లలిత కళ" వాటిలో ఉన్నదని అంటే ఈవిధమైన "లలిత కళ" మానవుల నైతిక జీవితాలను పాడుచేయుటకు కారణ భూతమవుతుంది.

అభిమన్యుని చావుకు నిజంగా సైంధవుడు చంపకపోయినప్పటికిన్ని తానెలా కారణమైనాడో అలానే ఈమేళాలు కళావంతుల బాలికలు పడుపువృత్తిలో దింపుటకు కారణమవుతూంది. కారణాన్ని అరికట్టిన కార్యమాగిపోవును. మేళంలో ప్రవేశపెట్టబడిన కళావంతుల బాలిక వివాహార్హతను గోల్పోతూంది. అందుచేత మేళంతోపాటు ఆమెకు వ్యభిచారంకూడ ఒక వృత్తిక్రింద ఏర్పడిపోతూంది. మేళాలు నిషేధింపబడిననేగాని కులధర్మమను భ్రమ తొలగి వ్యభిచారం నశింపబడదు. కాబట్టి వీటిని నిషేధించుటే సంఘానికి దేశానికికూడ శ్రేయోదాయకం

జక్కుల ప్రకాశరావు.

అనకాపల్లి.



## శ్రీ ప్రకాశ్ గారి బిల్లు.

శ్రీప్రకాశ్ గారు ప్రవేశపెట్టిన శాఖాంతర వర్ణాంతర వివాహముల బిల్లులతోనే విరమించక "స్త్రీ తాను యిష్టపడునట్టి, యేమతమునకు సంబంధించినట్టి పురుషుని వివాహ మాడుట" అని విశదీకరించుట మరీ వుత్తమ మైనది.

సంపూర్ణస్వాతంత్ర్య సువాసనలహరితో తులదూగనున్న భారతావనికి రానున్న సాంఘికాచారాలకు నిది పెట్టని కోటగా నుండగలదు.

ఇట్టి స్త్రీల హక్కులతో సహా స్త్రీ తానిష్టపడు వాని వివాహ మాడు హక్కును ప్రవేశ పెట్టుటకొక వయస్సును నిర్ణయించాలి. అట్టి వయస్సు యేసందర్భము లందును 17 సంవత్సరములకులోనిదియైయుండవలెను, అది కన్య పుష్పవతి అయిన నాటినుండి యనిపేర్కొన వలెను, లేదేని అట్టివయస్సునే ప్రస్తుతము తానిష్టపడని ప్రేమించని వారి యెదుట తల వంచ వలసిన దురాచారాలు మనసంఘము నుండి పోజాలవు. ఇట్టి దంపతులును తమ వాంచల సాఫల్య మునకు కుటుంబమును మంటపాలొనర్ప గలరు.

శ్రీమతి వంగల వాణీబాయి గారి ఫిబ్రవరి మీ సంచిక యందలి రచనకు దోడు - వారి పిల్లలను వీరు, వీరి పిల్లలను వారు చేసుకొనుట కంటే, బయటివారిని - యితర జాతులవారిని చేసుకోవడం వల్ల మనలో శుంఠ, నల్లతెల్లని పిల్లలు లేక తెలివి గల పిల్లలు పుట్టడము, చామన చాయ పిల్లల కనడమే గాక సంపూర్ణ ఐకమత్యము మరీ ఎక్కువ కాగలదు. స్త్రీలకు సంబంధించిన హక్కులు కూపస్త మండూక ముల్లైయుండు గ్రామిణులకు తగురీతి ప్రచార మగునట్లు ప్రభుత్వము ప్రయాసపడాలి. అప్పుడే భారత నారీలోకాని కొక అమూల్య భూషణం హస్త గతమౌను.

మమతకుమారి, చిత్తూరు.




దురాచారమగు
ఘోషాపద్ధతి
బలవంతంగా
చించివేసుకుని
విశ్వవిహారం
సల్పుదమనియేనా
నీ ఆశయం !

ఐతేరా నాతోరా.
ఘోషాపద్ధతి-చెరిపేద్దాం.
స్వేచ్ఛావీధుల-విహరిద్దాం.

పురుషుని చేతిలో
కీలుబొమ్మలై
అనారోగ్యముతో
క్రుంగిపోవుచూ
గిజగిజలాడే
నీచెల్లెళ్లకు,
దాస్యవిముక్తి
చేద్దామనియేనా
నీ ఆశయం !!

ఐతేరా-నాతోరా.
దాస్యశృంఖలముల-తెంపేద్దాం.
నవ్యజ్యోతులు-పరికిద్దాం.

లేశమ్మయినా
జాలిదలపక
రక్తంపీల్చే
కఠినహృదయుల,
కండలు పిండే
సంఘపుకోరల
పిప్పిచేసే
మూఢనమ్మకముల,
రూపేద్దామనియేనా
నీ ఆశయం!!!

ఐతేరా-నాతోరా.
పాడుసంఘాన్ని-ఎదురుద్దాం.
కఠినహృదయాల ఖండిద్దాం.

బాల్యవివాహపు
సనాతనులనూ,
కట్నాలడిగే
వియ్యంకులను,
వృద్ధవివాహపు
కర్మిష్టులనూ,
హతమార్చాలనియేనా
నీ ఆశయం!!!!

ఐతేరా-నాతోరా.
దురాచారముల-మాపేద్దాం
సంస్కరణ-మొదలెడదాం

వితంతూద్వాహం
గాంధర్వవివాహం
వర్ణాంతర పెండ్లీ
ఉపయోగంగా
ఊహించి,
ప్రోత్సహించాలనియేనా
నీ ఆశయం!

శారదా ఆక్టూ
దేవదాసీబిల్లూ
ఏకపత్నీవ్రతం
వారసత్వపు బిల్లూ
అమూలంగా
ఆశించాలనియేనా
నీ ఆశయం!

ఐతేరా- నాతోరా.
ఉపయోగంగా- ఊహిద్దాం.
ద్విగుణీకృతంగా- ప్రోత్సహిద్దాం.

ఐతేరా- నాతోరా
ఆక్టులన్నిటి- ఆశిద్దాం.
ఆక్టులన్నిటి- అభ్యసిద్దాం

పూర్ణ అవ్వారి, గుంటూరు.

—(o)—

శ్రీ వేదాంతం జగన్నాథశర్మ



"నర్తనశాల"లో- శ్రీ కేసరిగారి హైస్కూలు, మైలాపూరు- నాట్యాచార్యపదవిని, "ఛత్రపతి" ఫిలిమ్సువారి "బృందావనం"లో ప్రత్యేకదర్శకత్వమును వహిస్తున్న కూచిపూడి నర్తకులు.

శ్రీమతి జయమ్మ



శ్రీ చిత్రపు నారాయణమూర్తిగారి దర్శకత్వమున శ్రీ వెంకట్రామాపిక్చర్సువారి "బ్రహ్మరథం"లో నటిస్తున్న మేటి తార.

# మహాబలిపురయాత్ర.

శ్రీ. కే. తిరుమలచారి, ఎమ్. ఎ., ఎల్. టి.,

హిస్టరీ అసిస్టెంటు-కేసరీ హైస్కూలు, మైలాపూరు.



[ఫిబ్రవరి నెల 22, 23 తేదీలలో కేసరీహైస్కూలులోని 4, 5 ఫారముల విద్యార్థులు, శ్రీ. కె. తిరుమలచారిగారితో కూడా మదరాసుకు దక్షిణమున 35 మైళ్లదూరమున నున్నమహాబలిపురములోని పురాతన పల్లవ శిల్పములజూచుటకు వెళ్లియుండిరి. వారితో గూడ జూనియార్ హిస్టరీ అసిస్టెంటు శ్రీ. ఎమ్. హనుమంతరావు, తెలుగుపండితులు శ్రీ. టి. ఎల్. జనార్దనశర్మ, మరియొక అసిస్టెంటు శ్రీ. టి. నారాయణరావుగార్లు వెళ్లి తగుసహాయమొనర్చిరి. అచ్చటి శిల్పముల జూచునప్పుడును, తరువాత స్కూలులోను పల్లవులనాటిశిల్ప విషయములను శ్రీ. తిరుమలచారిగారు విద్యార్థులకు వివరించి చెప్పిరి. వానిలోని ముఖ్యాంశములిచ్చట పొందుపరుప బడియున్నది.]

మహామల్లపురమనబడు ఈమహాబలిపురమును నిర్మించినవాడు సింహవిష్ణు వంశస్థులగు పల్లవచక్రవర్తులలో మిక్కిలి గొప్పవాడును, మహామల్ల బిరుదాంకితుడగు మొదటి నరసింహవర్మ. ఇతడు క్రీ. శ. 630-662 వరకు రాజ్యమేలెను. రాజధాని కాంచీపురము. ఇతడు చోళ, పాండ్య, కేరళరాజులను జయించుటయేగాక చాళుక్యులపై దండెత్తి, వారిరాజైన రెండవ పులకేసిని సంగ్రామమున నోడించి చంపి అతని రాజధాని యగు వాతాపిని ఆక్రమించెను. అంతియేగాక సింహళముపై రెండుమార్లు దండెత్తెను. మామల్లపురమా కాలమున పల్లవుల వారికాశ్రయమై యుండెను.

పల్లవులు బహుదేవాలయ నిర్మాతలు. ప్రప్రథమమున ఉత్తర హిందూస్థానమునుండి దేవాలయ వాస్తుశిల్పముల దక్షిణదేశమున ప్రవేశపెట్టినవారు పల్లవులే. వీరిశిల్పములు పల్లావరం, ఆర్మమలై, పనమలై మహేంద్రవాడి, మామండూరు మున్నగుచోట్ల కానవచ్చుచున్నవి. మహాబలిపురములోని ఒంటిరాతి రథములు, గుహాలయములు, కుడ్యచిత్రములు ఎక్కువగా నరసింహవర్మ కాలమునాటివి. ద్రవిడ దేవాలయ వాస్తుశిల్ప సంప్రదాయములలో పల్లవసంప్రదాయము కడు రమణీయమైనది.

1. పైనపేర్కొనబడిన రాతిరథములు ద్రౌపది పంచపాండవుల పేరిట నిర్మింపబడినట్లు చెప్పుదురు. వీని ఆకారము, శిల్పములను పరిశీలించిన వీనిలో జైన, బౌద్ధశిల్పములు మిళితములై ద్రావిడ శిల్పము మొలకెత్తుట కాననగును. అనగా ఈరథములు జైనదేవాలయములు, బౌద్ధవిహారముల అనుకరణములైనను, ద్రావిడ శిల్పలక్షణమగు విమానశిఖరములు వీనియందు గానవచ్చుచున్నవి. వీనిచెంతనే ఒక్కొక్క రాతిలో తొలచి మలువ బడిన సింహము, ఏనుగ గలవు.

2. ఇచ్చటి గుహాలయములు ఉత్తరహిందూస్థానమందలి జైనబౌద్ధ గుహాలయములంత రమ్యము లైనవిగాక పోయినను వానిలో కొన్నింటి యందుగల చిత్రములు ఎల్లోరా, ఎలిఫెంటా గుహాలయందలి చిత్రములతో నేమాత్రము తీసిపోవు నవిగావు. ఈచిత్రములలో కృష్ణమంటపములలోనివి కడు హృదయాకర్షకములైనవి. శ్రీకృష్ణుడు గోవర్ధన పర్వతమునెత్తి గోవులను గోప గోపికలను కాపాడుట, మేఘము లుఱిమినపుడు ఆవులు బెదరి చెవులను నిక్కబొడిచి మూచుట, మిక్కిలి మనోహరముగా చిత్రింప బడియున్నవి. దీనికి దగ్గరగా 43 అడుగుల ఎత్తు 69 అడుగుల పొడవు గల ఏకాంతపు శిలపై అర్జునుని తపస్సుకు సంబంధించిన చిత్రములున్నవి. వీరిలో తపమొనర్చువా డర్జునుడా లేక భగీరథుడా యనుప్రశ్న గలదు, కాని ఈచిత్రము లన్నిటిలో జీవకళ ఉట్టిపడుచున్నది. ఇవిగాక మహిషా సురమర్దని, వరహావతారము, క్షీరాబ్ధిశయనము హృదయ రంజకములుగా నున్నవి. ఈచిత్రముల నానుకొని యుండుకొండలోనుమారు పదునైదు గుహాలయములుగలవు. ఎంత యెండలోవెళ్లి ఈగుహాలయములలో నిలుచున్నను మిక్కిలి చల్లగా నుండును. కఠిన శిలలలో తొలుప బడిన ఆలయములంత అందముగాలేవు. కొన్నిచోట్ల గుహాలయముల తొలుచుట నుపక్రమించి బండ మిక్కిలి కఠినముగా నుండుటచే వదలి వేయబడినట్లు చెప్పుదురు. కాని క్రీ. శ. 974 లో చాళుక్య దండయాత్ర ఫలితముగా నిచ్చట ఆలయనిర్మాణము వదలి వేయ బడెననుట నిర్వివాదాంశము.

3. సముద్రతీరముననున్న దేవాలయము గాక 9 ప్రత్యేక దేవాలయములున్నట్లును అవి సముద్రమున మునిగిపోయినట్లును పురాణ గాథకలదు. ఈదేవాలయములనుబట్టియే ఈనగరమునకు ఇంగ్లీషులో సప్తదేవాలయ నగరము 'The city of the Seven pagodas' అను పేరు గలదు. ఈదేవాలయమున శివకేశవు లిద్దరుగలరు. మహావిష్ణుశయన విగ్రహము, దేవాలయ విమానము ఆ కాలపు పల్లవ శిల్పుల నైపుణ్యమును చాటుచున్నవి. ఈఒక్కదేవాలయము గూడ సముద్ర పుటలల రాపిడికి గురియైయున్నందున కొంత కాలమునకు శిథిలమగునే మోయని తోచుచున్నది.

పల్లవుల కాలమున దక్షిణ హిందూదేశ మున హిందూమతపు నరుద్ధరణోద్యమము ప్రారంభమయ్యెను శైవనాయన్మారులు, వైష్ణవాళ్వారులు గీతములుపాడి జైనమతముల నుండి హిందూమతములోనికి ప్రజలనాకర్షించు చుండిరి. అట్టితరుణమున పల్లవ చక్రవర్తులు జైనలయ బౌద్ధచైత్య విహారముల కంటె మిక్కిలి రామణీయకరములగు దేవాలయ, గుహాలయ, శిలారథ విగ్రహముల నిర్మించి హిందూమత వ్యాప్తికై పాటు బడిరి. అట్టి పల్లవ చక్రవర్తులు సర్వదా చిరస్మరణీయులు.

—:o:—



## పూరీ పాయసం

బొంబాయి రవ ¼ పడి, నెయ్యి 2 పలములు, పొడిచేసిన వుప్పు ఒకచిటికెడు, ఈమూడు వస్తువులను తగుమాత్రం నీళ్లుపోసి ముద్దగా కలప వలెను. పావుగంట నానిన తరువాత సన్నికలుపై నెయ్యిరాచి, రవముద్దను పెట్టి మెత్తగాదంచవలెను. నలిగిన పిదప అరటిఆకు మూసివుంచవలెను. నెయ్యి ¼ పలందగ్గిర వుంచుకొని, కొద్ది కొద్దిగా చేతికి రాచుకొని కొట్టివుంచిన రవముద్దను, చిన్న నిమ్మకాయంత వుండలు చేసి అప్పడాల కోడుపుతో పూరీ తయారుచేసికొని నెయ్యి ¼ వీశె పొయ్యిమీద పెట్టి కాగినతరువాత ఒక్కొక్క పూరీని నేతిలో వేయవలెను. అదివేగిన తరువాత పూరీలన్నింటిని చేతితో పొడిచేసి వుంచుకోవలెను.

4 పళ్లు పట్టే కంచుగిన్నెలో 2 పళ్లుచిక్కని పాలుపోసి పొయ్యి మీదపెట్టి బాగుగా కాగిన తరువాత పొడిచేసిన పూరీలను పాలలోవేసి వుడుకు చుండగా ¾ వీశ పంచదారపోసి, ద్రాక్షపండ్లు 2 పలాలు, జీడిపప్పు 2 ఫలాలు, పచ్చకర్పూరం, కుంకుమపువ్వు, గుటిగింజయెత్తువీనినిపాలలో మెత్తగానూరి పాయసంలో కలపవలెను. జీడిపప్పు బంగారు చాయగా నేతిలోవేపియు, ద్రాక్షపండ్లునీళ్లలో కడిగి కాడలు, దుమ్ము లేకుండా యేరియు పాయసంలో వేయవలెను. సన్నని సెగమీద 5 నిమిషములు వుంచి దించి భుజించిన యెడల బహురుచిగా వుండును.

రావినూతల అనసూయా దేవి.

## బడ బడాలు.

అళాకు పెరుగులో పచ్చి మిరపముక్కలు, ఇంగువ, వుప్పు నూరి పెరుగులోకలిపి, ఆవాలు, కరివేపాకు తాలింపు పెట్టి దానికి తగినంత గోధుమ పిండి వేసి గట్టిగా కలుప వలెను. అప్పడముల పిడితో పల్చగా అప్పడములు చేసి అచ్చులతో వత్తి నూనెలో దేవ వలెను.

లీల.

---

ఇడి రమ్యాని కుపాయనమ్ములు మనోభీష్టంబుగాఁ బూరియల్,
వడలుం జక్కెరకర్జకాయలును లడ్వాలుక్కెరల్ పూర్ణపుం
గుడుముల్ గారెలు బెల్లమండెఁగలు నాఁగుల్ కమ్మచాఁపట్లు నూ,
టిడులుం దోసెలు నప్పముల్ సుకియలుం హేరాళమైకన్పడన్.

రామాభ్యుదయము, అయ్యలరాజురామభద్రుడు.

(వేరొకచో అచ్చువేసిన వేంకటేశ్వరశతకము నందలి పద్యములోను, పైపద్యములోను పేర్కొనబడిన పిండివంటల వివరము లెవ్వరైన తెల్పుచో ప్రచురింతుము. గృ॥సం॥)

గల అంతరంగికావయవము లన్నిటిపై నొకవిధమగు పొరగలదు. ఆహార ఆయా యవయవముల సంరక్షణకు, ఆహార జీర్ణాదులగు వాని వాని విధులు చక్కగా నిర్వర్తించుటకు చాల అవసరము. ఈవిటమిన్ ఏ- ఆహారగా అమరిన మాంస కృత్తులు పుష్టిగానుండుటకు, వానివిధుల పూర్తిగా నవి నిర్వర్తించుటకు తోడ్పడును.

అంటువ్యాధులు సులభముగా రాకుండ అడ్డుకొను శక్తినిచ్చును. అంటు వ్యాధులనగానే విషూచి మశూచి మాత్రమే అనితలచరాదు. జలుబు, దగ్గు, తీట మున్నగు నవియు గాలిసోకిన వచ్చునవియే.

ఈవిటమిన్ ఏ లేనందున కల్గు ప్రమాదములు: దేహము పెరగదు; గర్భకోశమందు పిండోత్పత్తి క్రమము నాటంక పరచును; రేచీకటియు సంప్రాప్తింప వచ్చును. చర్మము ఆర్ద్రముగాక బెరడు వారి పోవును. చర్మము ముడతలు పడును; నేత్ర వ్యాధు లంకురించును; నాసికా రంధ్రము, గొంతు, గుండెలు, పొట్ట, ప్రేగులు, చర్మము, మూత్రమార్గము, (స్త్రీలకు) రహస్యాంగ మార్గము-అన్నియు అంటువ్యాధులకు బలి యగు చున్నవి.

ఇక విటమిన్ "బి" కండర ములకు శక్తి సామర్థ్యములనిచ్చును.

ఇది తక్కువైనందున జఠరాగ్ని మందగించును; దేహము పెరుగ కుండుట లేక బరువు తగ్గుట, అజీర్తి, మలబద్ధకము, గుండె లదరుట, అలసట, నరముల దౌర్బల్యము, నాడీ వ్యాధులు, చురుకులు లేకుండుట, నీరు చూపుట, మున్నగునవి కలుగును.

కావున ఈమిరప కాయలను ఆహారముగా నుపయోగించుటే గాక ఆయావ్యాధులకు ఔషధముగా వాడుటకై దీనితో ద్రావకము (Tincture Capsicum) మాత్ర, చూర్ణము, ప్లాస్త్రి, కషాయము మొదలగు రూపముల తయారుచేసి, రోగుల కిచ్చుచున్నారు.

ఆమందులను దేశభాషలలో పిలువక లాటిన్ భాషలో (Latin) పిలుచుటచేత- మనకు తెలియక, క్రొత్తవిగ కన్పించును. మనఇంటిలో నిత్యము వాడుకొను మిరపకాయను లాటిన్ భాషలో కాప్సికం (Capsicum) అందురు, అందువల్ల ఆపేరట దానిని పిలుచు నప్పటికి అది యేదో సీమనుండి దిగుమతి యైన అపర సంజీవి యని భావించి భ్రమపడు చున్నాము. ఆంగ్లవైద్యులు అందరును మనదేశపు వస్తువులకే మారుపేర్లు పెట్టి వివిధ రూపములతో బుడ్లలో నింపి, బుడ్లను పాకింగులతో శృంగారించి వాడుచున్నారు. భేషజము భిషగ్లక్షణము గదా!

మిరపకాయ అనారోగ్య కరమైన వస్తువు కాదనియు, పైపెచ్చు ఆరోగ్య ప్రదము, బలవర్థకము అనియు చెప్పుటకు దానిని విశేషముగ నారగించుచు, మలిచిన శిల్ప విశేషముల వలె కన్నుల పండువుగా నుండు పల్నాటి పడుచులే తార్కాణములు. గుంటూరు జిల్లాలో వంగవోలు, నర్సారావుపేట, పల్నాడు, గుంటూరు, వినుకొండ మున్నగు మెట్టతాలూకాలల్లో మిరపకాయలు మిగత వారివలె మామూలుగ వాడుటేగాక ప్రత్యేకముగ కొరవికారము అనిచేసి నిల్వఉంచుకొని ప్రతినిత్య మది యొకసాధకముగా వాడుకొందురు. పండు మిరపకాయలను, ఉప్పును కలిపి దంచి బానలకు ఎత్తియుంచుదురు. కొంతమంది కొద్దిగా

చింతపండును ఇందుచేర్చెదరు. దీనిలో ఇష్టపడువారు వెల్లుల్లినికూడ చేర్చెదరు. ఈకారము అన్నములో, కలిపినప్పుడు ఎర్రని రంగుతో కలిపినట్లుండును.

దీని నలవాటుగా దిను గుంటూరు మండలంలోని మెరకతాలూకాల వారు-వారికి సహజముగ నుండు జొన్నల అన్నమో, సంకటియో, దీనితో కలిపి ప్రతినిత్యము భుజించుట చేతనే, ఇతరజిల్లాల వారి కన్న హెచ్చుగా ఆరోగ్య భాగ్యము ననుభవించు చున్నారు. ఇతర జిల్లాలకు పోనక్కరలేదు; ఆగుంటూరు మండలములోనే కృష్ణకాలువక్రింద పండు వరిధాన్యమును మిల్లుల, నాడించగా, తవుడంతయు పోయి బల వర్ధకములగు ముక్కలును విరిగిన తెల్లని బియ్యపు అన్నమును, వేపుడు కూరలతో తినుచు, కాఫీ, టీల పుక్షినింపుకొని కాల క్షేపము చేయు, రేపల్లె తెనాలి తాలూకాల నీరసాకారులు, నిస్తేజోమూర్తులు నైన వారిని, వారి కనతి దూరముననే కారవికారము, జొన్నన్నము పుల్లనీళ్ల కలవాటుపడిన పల్నాటి వాసులను, ఒడ్డు పొడుగు కలిగి, విశాలమైన చాతీలు, వడితిరిగిన కండలు, ఉరకలు పారు ఉత్సాహోద్రేకములు, సుస్థిరమైన జవసత్వములు గల్గి, ప్రాణముపోసిన ఉక్కు విగ్రహములవలె నుండే పల్నాటి స్త్రీపురుషులను, పోల్చిచూచిన మిరప కాయ మాహాత్మ్యము తెలియగలదు. అచటితల్లులు అట్టి ఆహారమున కలవాటు పడి నందుననే సమృద్ధిగా పాలుగల్గి తమబిడ్డలకు బాగుగా చాలినన్ని ఇవ్వగల్గుటయేగాక ధర్మాత్మురాండ్రై తల్లిలేని పిల్లలకు కూడ పాలిచ్చి పోషింప గలుగు చున్నారు. నాగరీకులమని తలంచు నారీమణులు పలువురు తమబిడ్డలకును స్తన్య మివ్వజాలక కృత్రి మాహారములనిచ్చి వారిని బాల్యము మొదలు అనారోగ్యవంతుల నొనర్చు చున్నారు. అట్టివారు పైన చెప్పిన పల్నాటి స్త్రీలను చూచి నేర్చుకొనవచ్చును. బాదంపప్పు, పాలు, అపిల్ పండ్ల కన్నా, జొన్నన్నము, కారవికారము, పుల్లనీళ్లే మేలైన ఆహారమేమోయని తోచు చున్నది. వంగవోలు పశువులు జగత్ప్రసిద్ధములుగదా. జొన్నదంటు మేయుటచేతనే వాటి కట్టి ప్రసిద్ధికలిగినది.

కారవికారములో కొందరు లేతవంకాయ ముక్కలను తరిగి గుచ్చియెత్తి నిల్వ యుంచుదురు. ఆపండు మిరప కాయ కారమును, దానితో చేరినఉప్పును వంకాయముక్కలను, విడిగా నున్నప్పటివలె చెడి పోనీయక కాపాడుటయే గాక దానికొక కమ్మదనము నిచ్చును. సుమా రారునెలల వరకు ఈ వంకాయ కారవికారము చెడిపోదు. కారమనగా మరేమియు కాదు. అత్యంతమైన చలువ. ఎక్కువ చలిగా నున్నప్పుడు పుండువంటి చలి కరచుచున్నది అందుము. అందుచేతనే కారమువల్ల నాలిక చుర్రుమనును. అయితే ఆచలువయే తనతో చేరిన లేతవంకాయ ముక్కను చెడిపోకుండ కాపాడ గలుగు చున్నది. ఆధునిక శాస్త్రజ్ఞులు చల్లని గదులలో పండ్లను భద్ర పరచి యుంచుటకు (cold storage) కనిపెట్టిరి గదా. అదియే పైకారవి కారమందలి తత్వముకూడ. కొందరు గోంగూర నిలవ పచ్చడి యందును మిరప పండ్లను కొద్దిగా కలియ త్రొక్కి యుంతురు. పచ్చిమిరప కాయలను నిమ్మకాయ ఊరగాయలందును, ఉసిరిక నిల్వ పచ్చడుల యందును కాయల పాళముగానే వేసియుంతురు. పచ్చిమిరపకాయలను మచ్చిగలో ఉప్పుచేర్చి అందునానబెట్టి బాగుగా మజ్జిగను పీల్చినతరువాత ఎండబెట్టుచు తిరిగి ఆనీటిలో నానబెట్టుచు పలుమారు ఇట్లుగావించి, నూనెలోగాని నేతిలోగాని ఆఊరుడుమిరపకాయలు వేయించి పులుసు సాధకములలో కొరికెదరు. మరికొందరు పచ్చిమిరపకాయలనే, కొద్దిగ ఉప్పు అద్దుకొనుచు నంచు కొందురు. గోంగూర పులుసు కూరలో పండుమిరపకాయలుగాని పచ్చిమిరప కాయలుగాని వేసి ఉడికించిన అది అమృత తుల్యముగా

నుండును. గోంగూరలో కూడ లోహమున్న దందురు. కావున కేవల మది జిహ్వకు రుచికరమే గాక ఆరోగ్య ప్రదము, బలవర్ధకము కూడ. మిరపకాయల పొడిని అన్ని ఊరగాయ లందును చేర్చెదరు.

గుంటూరు వాసులకు మిరపకాయ పైగల ప్రీతి నతిశయోక్తిగా తెల్పుటకై- అచ్చట బిడ్డలేడ్చిన- ఆడుకొనుటకు పొడుగాటి మిరపపండునో కాయనో ఇత్తురని యందురు. నెల్లూరిజిల్లాలో ప్రాగ్నాటి నియోగులపట్లకూడ నీసామెత చెప్పెదరు. అయితే- మొత్తము మీద ఆంధ్ర దేశమంతటను కొలదిగానో గొప్పగానో మిరపకాయల భుజించుటయం దారితేరిన వారే. గుజరాతీ లున్నూ మనవలెనే కారముతిందు రందురు.

మిరపకాయలు పలువిధములు కలవు. మామూలుగానుండు గుంటూరుకాయ గాక సీమమిరప కాయలని పెద్దలవంగములంతేసి వొక జాతిగలవు. వానిని హెచ్చుగా అప్పడముల పిండిలో కలుపుదురు. అవికలిసిన మన కారపు అప్పడములు దాక్షిణాత్యుల పప్పడము అప్పడముల వలె కాల్చినప్పుడు తెల్లగానుండక కంటికింపుగా ఎర్రదాళుగానుండి చాల రుచికరముగా నుండును. మరియొకతెగ మిరప కాయలు చిన్న వంకాయ లంతవి యుండును. వాటిలో కారము తక్కువ. సాధారణముగా నివి చిన్నచెట్లలో పండును. సంవత్సరము లోపుననే ఈచెట్టుఆయువు. ఇవి మెరకన పండును; తోటల పండును. తోటమిరపకన్న మెట్ట మిరపకాయ కారము, రుచికరము. ఈమధ్య తీగమిరపయని యొకటి వెలసినది. దానిని మద్రాసు వ్యవసాయ శాఖవారు ప్రచారమునకు తెచ్చుచున్నారు. అది ఆరునెలలకు పంటకు వచ్చి రెండేడ్లుకాయునట. అన్నిటి కన్నను గుంటూరు మిరపకాయ జాతియే ప్రశస్థమైనది.

మిరప కాయలను ఔషధములకు వాడు కొనునపుడు వాటిలోని గింజలను తీసివేసి ఆతొక్కులను పొడిచేయ వలయును. ఈక్రింద మిరపకాయలలో చేయదగిన ఔషధముల గురించి వ్రాయుచున్నాము.

## మిరపకాయలతో చేయబడు ఔషధములు

సామాన్యముగ సమస్త తత్వములకు, అన్నివేళల అనుకూలించునట్టిదియే వైద్యమున కుపయోగించును. సులభముగ లభ్యమగునది, గుణములు తెలియునట్టిది, అగుదానినే ఔషధరూపమున మార్చుకొనిన ఆరోగ్యమును కాపాడుకొనుటకు అవకాశము కలిగియుండును. కావున ఆంధ్రదేశము నందంతటను సర్వసామాన్యముగ పైరగుచు ప్రతియింటిలోను, కానుపించుచు ముఖ్య భోజనపదార్థమగు ఎండు మిరప కాయలతో నీ ఔషధములు తయారగుచున్నవి.

| | | |
|---|---|---|
| ఎండుమిరపకాయ | 1 | గురిగింజ |
| శొంఠి | 5 | ” |
| రేవలచిన్ని | 5 | ” |

చూర్ణరూపమున తయారొనర్చి జాగ్రత్తపరచి భోజనానంతరము సేవించిన ఉదరసంబంధమయిన వ్యాధులు కలుగనేరవు.

అజీర్తి విరేచనములు, నీళ్లవిరేచనములు, కడుపులో నొప్పితోకూడిన విరేచనములు, సామాన్య తీవ్ర దశలలో కూడ యీ క్రింది విధమున వాడవచ్చును.

| | | |
|---|---|---|
| మిరపకాయతొక్కలు గింజలులేనివి | 1 | గురిగింజ |
| నల్ల ఇంగువ | 1 | ,, |
| ముద్దకర్పూరము (హారతికర్పూరము) | 1 | ,, |

వీటిని చూర్ణరూపముగ చేసుకొని వేడినీటితోగాని లేక కషాయముగ చేసుకొనిగాని వాడుకొనవచ్చును. వేడివల్లగాని శీతలముచేగాని గొంతునొప్పి, రాపు, కఫముతెగిపడని దగ్గు మొదలగు వాటియందు

| | | |
|---|---|---|
| మిరపకాయలు (గింజలు లేనివి) | 1 | గురిగింజ |
| కలబంద గుజ్జు | 1 | ,, |
| తేనె మాత్రయగుటకు చాలినంత | | |

తేనెతోటి మాత్రయగునట్లు తయారుచేసుకొని ఉపయోగించు కొనవచ్చును. మోతాదు 3 గురిగింజలుండిన చాలును.

### మలబద్ధకమునకు, ఆకలి లేకుండుటకు

| | |
|---|---|
| మిరపకాయలు | 1¼ తులము |
| నేలతంగేడు | 1¼ తులము |
| బెల్లము | 2½ తులములు |

వీనిని బాగుగాదంచి ముద్దరూపముగ చేసుకొని మలబద్ధకముగలవారు వారికి అనుకూల మగునంత ¼ తులము సుమారున పుచ్చుకొని వేడినీళ్లు చాలినన్ని త్రాగిన విరేచనముసాఫీగా అగుటయేగాక మంచిఆకలిని బుట్టించును.

### గమనిక

బలహీనులు, రక్తపటిమ, అజీర్ణకోశవ్యాధులు గలవారు - కారమును-చూచిన- వాడుకొనుట యన్న భయపడుదురు. కాఫీ, టీ సర్వదా తాంబూల చర్వణముటూత్ బ్రిష్ మొదలగు వానిని అలవాటు చేసుకొనిన వారిని చూచిన అవసరమయినపుడెల్ల విరేచనముచేయగలట్టి ఔషధములపాలై, మలకోశమును, జీర్ణకోశమును పాడుచేసుకొని ప్రేగులసంబంధమయిన జబ్బుల పాలగుచుందురు. గుంటూరు జిల్లాలో ఇట్టి కారము అభ్యాసమును చేసుకొనినందువలననే, వారు ఆరోగ్యము, శరీర సౌష్టవసంపద, కలవారైయున్నారు.

మరియు లోపలకు పుచ్చుకొనుటవల్ల సుగుణములు కల్గుటయేగాక - శరీరమునందు అనగా ముఖ్యముగా కీళ్లుమడతలుపడు స్థలములయందు వాపులు (దబలకము) కానుపించినపుడు మిరపకాయలను, మెత్తగదంచి అప్పచ్చిమాదిరిగ జేసి వేయునట్టి స్థలమున మొదట ఆముదమును రాచి పైనవేసి గాలియాడునట్లు వదులుగ కట్టుకట్టిన వాపు యేర్పడుటకు నిల్చియున్న దుష్టరక్తమును శుభ్రపరచి నొప్పిని నెమ్మదింపజేయును. గ్రామములలో టించరు అయోడిన్ సమయమునకు లభ్యపడకున్న ప్రథమ చికిత్స చేయుటకు ఉపయోగ పెట్టుకొనవచ్చును.

### ఇంకొకమాట

దృష్టిపారిన లేక సోకిన కొంతమందికి, పిన్నలు మొదలు పెద్దలకు సైతము, కొన్ని వేళల దృష్టితగిలి బాధపడుచుందురు. దీనినే రాజదృష్టి యనుటకూడ ఆచారము కలదు ఇట్టి విషయములు ప్రతిగృహలక్ష్మికి కూడ తెలియుటవల్ల చంటిపిల్లలకు చికాకు, ఏడ్పు, రోదన, నిద్రపోకుండుట మొదలగు లక్షణములు కానుపించినప్పుడు మండు నిప్పులలో మిరపకాయలను వేసెదరు. అప్పుడు తల్లులు ఊహించినట్లే నిప్పులో వేయు వస్తువులయొక్క వాసన యేమియు తెలియకుండును. కొంతసేపటికి పిల్లలు తెప్పరిల్లి సరియైనమాపు, హాయి చెందెదరు.

——(0)——

## అంట్లుతోమను, గుడ్డలుతకను యంత్రం.

శాస్త్రజ్ఞుల ధర్మమా అని ఈమధ్యనే కనిపెట్టిన ఒక క్రొత్తయంత్రం గృహిణి నిత్యకృత్యాల్ని తేలిక పరచినది. ఇది బట్టలు ఉతకడం, గిన్నెలు తోమడం వగైరా, అన్నిపనులూ దానంతటఅదే చేస్తూంది. ఈయంత్రం ఎనామిల్ లో చేయబడి మన ఇంట్లోని కుళ్లాయికి, బేసిన్లకీ తగిలించుకోవచ్చు. యంత్ర భాగమంతా లోపలే వుంటుంది. రాపిడి ఏమాత్రం లేకుండా క్రొత్త విధానంలో పనిచేస్తుంది.

8- పౌన్ల గుడ్డల్ని ఉతక డానికి 30-నిమిషాలు పడుతుంది. ఈమిషన్ లో గుడ్డల్ని పిడిచి ఆరబెట్ట డానికి పట్టె 5- నిమిషాలు కూడా కలిసే ఈ 30 నిమిషాలు.

దీన్నే అంట్లు తోమడానికైతే లోపలున్న తొట్టి మార్చాలి. అంట్లని ముందు నానబెట్టవలసిన పని వుండదు గాని బ్రష్‌తో చేతులు తోముకొనే విధంగా గీకాలి. కొళాయిలో వేడినీరు లభించకపోతే యీ మిషను ముందు పని మొదలు పెట్టేటందుకు 3- పౌన్ల వేడినీరు ఉపయోగించ వచ్చు. తోమిన గిన్నెల్ని తుడవ డానికి తువ్వాలు కూడా అవసరంలేదు. ఒక ప్రత్యేక ఏర్పాటువల్ల లోపల పుట్టే వేడిగాలిచే అవి 3-4- నిమిషాల్లో తడి ఆరి వుంటాయి. పింగాణీ, గాజు, వెండి పాత్రలు, ఇనుపసామానుల్ని- సమస్తమైన గిన్నెలూ అతి జాగర్తగా తోముతుంది.

(నవజీవన)

# బ్రతుకు తెరువు

## (సెన్ సెన్) Sen Sen మైలైన తాంబూల మాత్రలు.

| | | |
|---|---|---|
| అతిమధుర పాలు | 10 | తులములు |
| చక్కెర | 2½ | ,, |
| మెంతాలు | 20 | గురిగింజలెత్తు |
| రోజా అత్తరు | 10 | చుక్కలు |
| కస్తూరి | 1/16 | తులం |

అతిమధుర పాలను కల్వములో వేసి మెత్తగనూరిన పిమ్మట చక్కెరను కలుప వలయును. కడపట కస్తూరి మెంతాలును కలిపి కలియనూరి మాత్రలనుచేసి బుడ్డిలో వేసి రోజా అత్తరును మాత్రల మీద వేసి బాగాకుదిలించి బిరడాబిగించి వాడుకొనవలయను. ఇందు వలన, నోటి దుర్గంధము పోవుటయే గాక జీర్ణశక్తి, ఉత్సాహము కలుగును.

## వాసిలైను పోమేడు (Vaseline Pomade)

| | | |
|---|---|---|
| వాసిలైను | 2000- | భాగములు |
| తేనెమైనం (Bees wax) | 500- | ,, |
| జరేనియం అత్తరు (Geranium oil) | 5 | ,, |
| నిమ్మ నూనె (Lemon oil) | 3 | ,, |
| లవంగములధృతి (Clove oil) | 2 | ,, |

ముందు మైనమును నీటి ఆవిరి మీద గాచి పిమ్మట వాసిలైను దానిలో వేసి రెండు కలిసి కరిగిన పిమ్మట గుడ్డలో వడియగట్టి కొద్దిగఆరిన పిమ్మట జరేనియం, నిమ్మలవంగ నూనెలనువేసి గట్టిపడువరకు కలియ బెట్టి బుడ్డిలో వేసి వాడుకొన వలయును- ఇందులో తేనెమైనము చేరినందున తల రేగకుండును.

పైచెప్పిన వాసనతైలములనే గాక ఇష్టము వచ్చిన వాసనలను చేర్చుకోవచ్చును.

## అరటి పండ్లజల్లిక (Banana Jelly)

దోరగ పండిన అరటి పండ్లను తీసుకొని పైతోలును తీసివేసి సన్న ముక్కలుగ నరికిన బద్దలను వకపౌను (40 రూపాయల తూనిక) తూచి కళాయి గిన్నెలోవేసి వకపౌను నీళ్లు కూడ పోయవలయును. సుమారు గంటసేపు పొయిమీద వుంచిన బద్దలు మెత్తబడును. పిమ్మట వానిని జల్లిగుడ్డలో వేసి మరియొక పాత్రిలోనికి బాగాపిండు కొనవలయును. అపిండుకొనిన గుజ్జులో వకపౌను తెల్లచక్కెరనువేసి మరల పొయిమీద పెట్టి వక గంటసేవు కాచిన హల్వా పాకమగును. అప్పుడు దించి పెట్టి అరబద్ద నిమ్మ పండు రసమువేసి కలుపవలెను. కుంకుమ పువ్వు పొడినికూడ కలిపినబాగుండును. వేడిగయుండు నపుడే జాడీలో భద్రపరుపవలయును. ఈపాకము చాలాకాలము యుండును. బిడ్డలు దీనిని మిక్కిలి ప్రేమింతురు. ఆరోగ్య మయిన ఆహారము. ఇదిజాడీలో వేయుటకు ముందు జాడీలోపల సాంబ్రాణి ధూపమును వేయవలయును.



అడయారులో కస్తూరిబా మెమోరియల్ సంస్థయందు తర్ఫీదు అవుతున్న నారీరత్నములతో రాష్ట్రపతి ఆచార్య కృపలాని.



కొత్త వైస్రాయి మౌంట్ బాటన్ ప్రభువు వారి ధర్మపత్ని.

“25 సంll ల క్రితం ఇక్కడ, ఈ ఢిల్లీపట్నంలోనే మా వివాహానికి నిశ్చయార్థం జరిగినది.”

మౌంట్ బాటన్ ప్రభువు, 24.3.47.

# కల్నల్ దంపతులు.



కల్నల్ ప్రేమకుమార్ సెహగల్ — కల్నల్ లక్ష్మి.

ఆజాద్ హింద్ ఫౌజుకు చెందిన యీ ఉభయులకు 8-3-47 న వివాహం జరిగింది.

కల్నల్ సెహగల్ : లాహోరు హైకోర్టు న్యాయమూర్తి శ్రీ అచ్ఛూరాం కుమారుడు.

కల్నల్ లక్ష్మి : శ్రీమతి అమ్ముస్వామి నాథన్, ఎం. ఎల్. ఎ. (ఢిల్లీ అసెంబ్లీ) కుమార్తె.



# వీరవనిత
## (జోన్ ఆఫ్ ఆర్క్)

శ్రీయుత చెరుకుమూడి రాధాకృష్ణమూర్తిగారు, నెల్లూరు.

అది 1428 వ సంవత్సరంలో అక్టోబర్ నెల. ఫ్రాంసుదేశంలో "ఆర్లియన్సు" పట్టణాన్ని ముట్టడించడానికి బలిష్ఠములైన ఆంగ్లసేనలు సాలిస్బరీ ప్రభువు నాయకత్వంకింద వచ్చేస్తున్నాయ్! ఇంకేముంది? ఆపట్టణమే గనక ఆంగ్లేయుల వశమైందంటే ఫ్రెంచివారికి మరి పుట్టగతుల్లేవు. దక్షిణఫ్రాన్సులో మంచివునికిపట్టులోవుండే ఆనగరమే అన్యాక్రాంతం అయిందంటే ఏమన్నమాట? స్వేచ్ఛాజీవులైన ఫ్రెంచివారిచేతులకు సంకెళ్లు తగిలిస్తారు బ్రిటిష్‌వారు. ఫ్రెంచివారు ఇలాంటి-క్లిష్టపరిస్థితు ల్నెదుర్కొని ఎలాబైటపడ్డారో—అదొక విచిత్రఘటనం.

ఫ్రాంసుదేశం ప్రాగ్భాగంలో వోచిన్ని పల్లెలో వో కాపువాడున్నాడు. అతనికో కూతురు వుంది పద్దెనిమిదేళ్లది. ఆమెపేరు జోన్. మంచి ఒడ్డూపొడుగూ మనిషి. అతిప్రబలమైన మనస్సు కలది జోన్‌కన్య.

తనతండ్రి గొర్రెల్ను పచ్చికబైళ్లకి తోలుకపోయి తీరిగ్గా కూర్చున్నప్పుడల్లా ఆమె యుద్ధం వల్ల వచ్చే కష్టనష్టాల్నుగురించి తీవ్రంగా ఆలోచించేది. ఇప్పుడు తనదేశానికి దాపరించిన కష్టదశను తలుచుకుంటే ఆమె సున్నితహృదయం ఆరాటం పొందింది. తనదేశాన్ని శత్రుబారినుండి ఎలాకాపాడుదామా! అని ప్రతినిత్యమూ తలపోస్తుండేది జోన్‌కన్య.

ఇలావుండగా వుండగా వోరోజు ఆమెపశువులనుకాస్తుండే టప్పుడు ఆమెకు దేవుడు ప్రత్యక్షమైనాడు. 'తక్షణం వెళ్లి శత్రుసేనల్ను ఎదుర్కొని ఫ్రాన్సురాజకుమారుడు చార్లెస్‌కు రీమ్సులో పట్టాభిషేకంచెయ్యి' అనిదేవుడాజ్ఞాపించాడు.

ఆరోజు సాయంత్రం ఇంటికి తిరిగి రాగానే జోన్‌కన్య తలిదండ్రులకు చెప్పింది తనకు భగవంతుడు ప్రత్యక్షమైనాడని. ఇరుగుపొరుగువాళ్లంతా ఇదివిని జోన్ను హేళనచేయసాగారు. కాని ఆమెవీళ్లమాటల్ను లెక్కచేయలేదు. తనదేశాన్ని శత్రువుల బారినుండి కాపాడగల ననే దృఢనమ్మకం ఆమెకుంది.

ఎలాగో వోలాగు తలిదండ్రులను ఒప్పించి, నేరుగా ఛార్లెసుప్రభువు ఆస్థానానికి దారి తీసింది. అక్కడ చేరగనే ఛార్లెస్సును సందర్శించి వున్నదంతా పూసగుచ్చినట్లు చెప్పేసింది.

ఈమె చెప్పే కథను శ్రద్ధతో విన్నాడు ఛార్లెస్. ఈమెనిజంగా తనదేశాన్ని వుద్ధరించి తన్ను రాజుగాచేస్తుందా? ఈమె వట్టి డంబాలు పలుకుతుందా? స్త్రీయెక్కడ, తన్ను కాపాడ్డం ఎక్కడ? అని మొదట హేళనచేశాడు. కానీ ఈమె నిర్మల జీవితాన్ని గడుపుతుందనిన్నీ తనమతంలో ఈమెకు నమ్మకముందనిన్నీ తన అనుచరుల ద్వారా తెలుసుకున్నాక ఛార్లెస్ మనస్సు మార్చుకొని 'సరే నీయిష్టం వచ్చినట్లుచెయ్యి' అని జోన్‌కు చెప్పాడు. జోన్ సంతోషంతో గంతులేసింది.

నిగనిగలాడే తెల్లటి కవచాన్ని తొడుక్కొని, కుడిచేతిలో ఒకబల్లెంపట్టుకొని, మంచి ఆరితేరిన యుద్ధపుగుఱ్ఱాన్ని ఎక్కి స్వారిచేస్తూ బయల్దేరింది వీరవనిత జోన్. తీర్చిదిద్దిన ముఖం, ఆకర్షణీయమైన నేత్రాలు, నిగనిగలాడే నల్లని కేశాలు, ఆమె ఆకారాన్ని చూచిన వాళ్లంతా ఈమెయెవరో దేవకన్యయని అనుకొన్నారు. దోవలో 'కాతరీన్' అనేచోట ఆగి ఒకచిన్నగొడ్డలి, కత్తి పుచ్చుకొని మళ్లీ బయల్దేరింది జోన్. 'జీసస్—మేరి' అనే అక్షరాలు కుట్టబడిన వో జెండాను పట్టుకొని సేవకుడొకడు ఆమెముందు దారిజూపుతున్నాడు.

సైనికులంతా ఈమెరూపం, గుఱ్ఱాన్ని నడపడంలో చాకచక్యం యివంతా చూచి దిగ్భ్రమజెందారు.

"పొండి-పొండి-శత్రుసేనలు తాకండి" అని ఎలుగెత్తి అరిచిందిజోన్. సైనికులు హడలిపోయారు. ఎక్కడలేని వుత్సాహం రోషం వారిని ఆవరించేసింది. ఫలితం? మరుక్షణంలోనే ఆంగ్లసేనలకూ ఫ్రెంచిసేనలకూ ఘోరయుద్ధం ఆరంభం అయింది.

1429 వ సంవత్సరం ఏప్రిలునెల 28 వ తేదీనాటి రాత్రి ఝోరు వర్షంలో ఆర్లియన్స్ ప్రవేశించింది, జోన్ కొద్దిపాటి పరివారంతో. నాల్గురోజుల తరువాత యింకొకసైనిక దళాన్ని ఆహారసామగ్రులను పట్టణంలోకి చేర్పించింది.

ఆంగ్లసైనికులు తమవుత్సాహం కోల్పోయారు. జోన్ కన్య ఒట్టిమంత్రకత్తె అని భయపడువారంతా, దీనితోటి, నిర్వీర్యులై ఫ్రెంచిసైనికుల ధాటికి తాళలేకపోయారు. మేనెల 8 వ తేదీన ఆంగ్లేయులు ఆర్లియన్స్ ముట్టడి మానుకున్నారు.

సరి; అప్పటినుంచి ఫ్రెంచివారికి పట్టినదెల్ల బంగారం, ముట్టిందెల్లముత్యం అయింది. లాయిర్‌నదికి వుత్తరంగా వుండే పట్టణాలు ఒకటివెంబడి ఒకటి ఫ్రెంచివారి చేతుల్లో పడ్డాయి.

జూలైనెల 17 వ తేదీన (1429 సం॥) ఛార్లెసుకు పట్టాభిషేకం అతివైభవంగా జరిగింది రీమ్సు అనేచోట. ప్రభువు పక్కనే నిలుచుండి వీరవనితజోన్ విజయపతాకాన్ని చేత బట్టుకొన్నది. జోన్‌సంతృప్తురాలైంది. భగవంతుడు ఆజ్ఞాపించిన ప్రకారం తనవిధిని నెరవేర్చి దేశానికి మహోపకారంచేసింది జోన్.

అది మొదలుకొని కొన్నిసంవత్సరాలపాటు ఫ్రాంసుకూ ఇంగ్లాండుకూ యుద్ధం సాగింది. దినదినానికి యింగ్లీషువారు వెనక్కుదగ్గారు.

1430 వ సంవత్సరం మేనెలలో ఆంగ్లేయులవైపు పోరాడే దేశద్రోహులు కొంత మంది ఏమరుపాటులో వుండే జోన్‌ను చెరబట్టారు. కొన్ని నెలలు అయిన తర్వాత వారు ఆ వీరవనితను ఆంగ్లేయుల కర్పించారు ఎక్కువ డబ్బుపుచ్చుకొని. ఆంగ్లేయులకు ఆమెపై కసి దీర్చుకోడానికి సమయం దొరికింది. ఆమెను తీసుకపోయి ఓన్యాయాధిపతి చేతిలో పెట్టారు. ఆయన 'ఈమె పెద్దమంత్రకత్తె, ఈమెను కాల్చివేయండి' అని తీర్పుచెప్పారు.

మేనెల 1431 వ సంవత్సరంలో రోయన్ అనేచోట నడిబజారులో ఓపెద్దమంటచేసి జోన్‌ను కాళ్లుచేతులు కట్టివేసి అందులో పడేశారు ఆంగ్లేయులు. ఈ దారుణ కృత్యాన్ని చూచి అంతా కంట తడిపెట్టుకున్నారు. ఈ వార్తవిని ఫ్రెంచి దేశీయులంతా చాలా గోలపెట్టి దుఃఖించారు.

రోయన్‌లో ఆమెను కాల్చివేసినచోట వో పెద్దరాతివిగ్రహం వుంది యిప్పుడు. అది జోన్ తనదేశానికి చేసిన సేవను చిరస్థాయిగా చేసింది.

తన దేశస్వాతంత్ర్యంకోసం ప్రాణాలర్పించింది వీరవనిత జోన్! ఆమె చనిపోయినా ఆమె ఆత్మ యింకా జీవించివుంది.



అరిసెలు నూనె బూరెలును నౌఁగులుఁ జక్కెర మండెగల్ వడల్<br>
బురుడలు వాలమండెఁగ లపూపము లయ్యలమేలుమంగ నీ<br>
కరుదుగ విందుబెట్టె పరమాన్నశతంబుల నూవకోట్లతో<br>
నిరత వి నిర్మలాన్నముల నేతులసోనల వేంకటేశ్వరా.

తాళ్లపాక అన్నమయ్య,<br>
వేంకటేశ్వర శతకం.

# స్త్రీహృదయము.

(శ్రీయుత మంచళ్ల సుదర్శనాచార్యులుగారు.)

[రోషావేశమున నొక దుర్మార్గుఁడు, తా నితరులను బాధించి లభించు దానితో జీవితమును గడుపుట న్యాయ దూరమని హితవుఁ గఱపిన వానిని హత్యఁ గావించినాఁడు. హంతకుని విచారణ సమయము నందు, అతని భార్య దుఃఖావేశయై పతిభిక్షఁ బెట్టుమని ప్రార్థించిన మీదట, హతుని ఇల్లాలు రాజుతో ఈ రీతిగా పలికినది.]

చంపిన మాటవాస్తవమె చంచల బుద్ధినితండు నాపతిన్;
గంపిత దేహుఁడై, మరణ కాలము దగ్గఱె నన్న భీతిచేఁ
గంపిలుచుండె; నింగిఁగను కన్నుల నశ్రుజలంబు నిండె; శి
క్షింపఁగ నేల నీతనిని? ఛీ! యని వీడిన బుద్ధి వచ్చెడున్.

వీనిం జంపిన లాభమేమి? పృథు లోర్వీనాథ! శోకార్తిచే
మేనం జల్వలు గ్రమ్మ వీనిసతియున్ ప్రేమించు చుట్టంబులున్
బ్రాణాలన్ ద్యజియింతురు; వారలకుఁబ్రాణారిష్టముం గల్గినన్
నా నాథుండు సజీవుఁడౌ నొకో! జగన్నాథుండె శాసించినన్.

శాసన ధిక్కృతిన్ జఱుపఁజాలిన వానిని వీడరాదు; కా
నీ, సుకుమారి యైన సతి నేఁడిటఁ దీవ్రతర వ్యథార్తయై
ఆసలుమాని ప్రాణముల నర్పణసేయుటఁజూడ లేను; త్య
క్తాసువులబ్బునే పతికి న్యాయ మొనర్చెడు వారిచేతులన్.

మంగళసూత్రనిర్వహణభాగ్యమె కోరెద రంగనామణుల్
పొంగులు వారు దుఃఖమునఁబ్రొద్దులు పుచ్చుచు నున్నదాన; నా
కుం గళసూత్రధారణముఁ గోల్పడు రాత లభించె నంచు; నీ
యంగన కేలఁ గూర్చెదవు ప్రాణములం బెకలించు శోకమున్?

వైధవ్యంబును, దానఁబ్రాప్తమగు దుర్వారవ్యథాభారమున్
భేధింపంగ సమర్థులే నరులు? వీనింగూల్పఁ బ్రేరేచి నే
సాధింపంగలదేది? వేఱొక సతీ స్వాంతంబు శోషింపగన్
బాధల్ పెట్టుట దక్క! నోచగలనా మాంగళ్య సౌభాగ్యమున్?

నాదు పురాకృతాఘమనినన్ సముచిత మౌను; కానిచో
గాదిలి పట్టిని న్వదలి, కాపురమున్నడియేటఁ ద్రోసి, ఈ
మాదిరి మృత్యువాతఁ బడఁబాడియె, వీడుచునన్ను, తెంపిపై
మేదిని నుండుమంచు? పరమేష్ఠి లిఖించెను గాఁ నివ్విధిన్.

నాశం గల్గిన దుర్వ్యవస్థ కితనిన్ గర్వత్వముం బూనగా
శ్రీ కాంతుండు విధించె నేమొ? వసటం జెందంగ నన్నెంచెనో?
కాకున్నన్ బలవన్మృతింగనునె నా కాంతుండు? దైవేచ్ఛకుం
జీకాకుంబడి ధిక్కృతిన్ సలుప యత్నింపంగ సాధ్యంబొకో!

పసుపుం గుంకుమ శోభలన్ గులుకు సౌభాగ్యబు వాంఛించు స్త్రీ
కసమానంబగు దుఃఖముల్ గలుగ నేనర్థింపఁ బృథ్వీశ; స
ర్వ సముం డెటులో శిక్షఁ గూర్చితనికిన్; పాపంబొ పుణ్యంబొ దు
ర్వ్యసనాలోలతఁ జిక్కఁ జేసె; క్షమియింపన్ సన్మతిం దెల్పెదన్.

★ ★ ★

ఔరా! ఎంతటి సాధుశీలయొ! పతిప్రాణాపహారిన్ గృపా
పూరస్వాంతమునన్ క్షమించినది; ఈపూఁబోణి సత్కీర్తియున్
దారార్కంబుగ ధాత్రి నిల్వలయు; నాంధ్ర స్త్రీమణుల్ మిన్నలై
కారుణ్య క్షమ శాంతి దాంతి సుగుణ క్రాంతిం ప్రదర్శింపరే!

——:o:——

# సమస్య!

సప్తాక్షరంబుల సరసనామం బొండు సరిగఁ దెల్పును దీనిఁ జదువు వారి;
నాద్యంతముల చెలిమి యాంగ్లపానీయంబు, చివర రెండును గూడ చిన్నిబిరుదు;
మూడు నేడుల జాడఁ జూడగా నొక పక్కి; నత్యుత్తమంబు నాల్గైదుఁ గలియ;
పొడిగించి రెంటిని పొదుప నైదింటితోఁ బౌరోహితుం డాంగ్ల భాషయందు;
నయిదు దీర్ఘముఁ జేసి యత్యంబు నతికింప నాసనంబై చెలగు నందఱకును;
ఆంధ్ర లిపియైన భావంబు నాంగ్లమగుట
చెప్పఁ జాలరె చదువరుల్ చిటికలోన!
సరసమతి తోడ వేఁదెల్ప సంతసింతు;
చెప్పలేకున్న నగుదు నే చిన్ని నగవు!

(సమాధానం వచ్చే నెల సంచికలో స్త్రీలు ఎవరైన పంపవచ్చు,)

గాదె లక్ష్మీ నరసమ్మ (బరంపురం)

——(o)——

# బలిదానం

(నాటిక) శ్రీమతి ఘండికోట సావిత్రిగారు.

పాత్రలు

రాణా:- మేవాడ రాజు, వీరుడు, అందగాడు.
చందావత్ - మేవాడ సర్వసైన్యాధిపతి.
పురోహితుడు, కొందరు సర్దారులు.
హాడారాణి:- చందావత్ భార్య, వీరనారి అందకత్తె.

౧

[మేవాడరాజ సౌధమునందలిగది. గదిలో రెండు సోఫాలు. కిటికీదగ్గరగా హంసతూలికా తల్పము. హాడారాణి ప్రకృతిని తిలకిస్తూంటుంది. చందావత్ మెల్లగావచ్చిహాడా రెండుకన్నులు మూస్తాడు].

హాడా:-(ఉలుక్కుపడి) అబ్బా! ఎందులకీ మోటు పరిహాసము.

చందావత్:-(నవ్వుతూ) ఎందుకంత తత్తర. (హాడాను దగ్గరగా తీసుకొని) దానికేమిగాని, నీతోనొకవిషయము చెప్పదలచితిని.

హాడా:-ఏమది, నాథా! చెప్పుడు.

చందావత్:-హా! చెప్పుటకేమున్నది. ఎట్టి తండ్రియైన కన్నకూతురు పట్ల ఇంతకాఠిన్యము వహించునా యని.

హాడా:-ఏమది! మీరుచెప్పునది నాకర్థమగుటలేదు.

చందావత్:-రూపనగర రాజకుమారిత, తన్ను ఔరంగజేబునకిచ్చి పెండ్లిజేయు నుద్దేశముతోనున్న తండ్రి బారినుండిరక్షించమని రాణావారిపేరిట జాబువ్రాసినది.

హాడా:-ఇంతకీ, రాణావారు ఆమెకు సహాయమొనర్తురా?

చందావత్:-విచారమెందులకు, శరణన్నవారిని రాణావారు విడుచువారుకారు. కాని, మనకు ఔరంగజేబుతో యుద్ధముతప్పదు.

హాడా:-ఏమైననేమి! తప్పక ఆమెను రక్షించవలయును. (పైనుండి పిలుపువిని) నేడు సర్వసైన్యాధిపతుల నిర్ణయము జరుగునట, మిమ్ములను సభకు రమ్మనిఆజ్ఞ.

చందావత్:-ఔను! వెళ్లకతప్పదు.

౨

[మేవాడ రాజసభ నిండుగా అలంకరింపబడి యున్నది. రాజావారు సింహాసనముపై అధిష్టించి యుండిరి]

రాణా:-సర్దారులారా! రూపనగరరాజు తురుష్కులతో సఖ్యము చేయుచుండెనట. యిపుడు మన కర్తవ్యమేమి?

ఒకసర్దారు:-ప్రభూ! మనము ఇప్పుడు తొందరపడుట మంచిదికాదు.

రాణా:-నేడో! రేపో! మనపై దండెత్తిన............

చందావత్:-(మధ్యనుండిలేచి) ప్రభూ మనము రూపనగరముపై ముందుగా దండెత్తిన, మనకు తురుష్కుల భయముండదు.

రాణా:-సెబాష్! చందావత్! నీవే స్వయముగాపోయి రూపనగరముపై యుద్ధము ప్రకటింపుము.

చందావత్:-చిత్తము! ప్రభూ. (అని నిష్క్రమించును.)

(చందావత్ అంతిపురిలో ప్రవేశము. హాడా పూమాలతో స్వాగతము.)

చందావత్:-ఏమి యీ సంతోషము.

హాడా:-(చిరునవ్వుతో) తమకు, సర్వసైన్యాధిపత్యము లభించినందులకు. (చందావత్ కళ్లలోనికి చూస్తూ) దానికేమిగాని, మీప్రయాణమెప్పుడు?

చందావత్:-ఎప్పుడననేల, నేడే పోవలయును. (లేచి దుస్తులను మార్చుకొనుచుండును, హాడాలోనికి పోయి హారతి పళ్లెముతో ప్రవేశము.)

చందావత్:-(హాడాను దగ్గరగా తీసుకొని) హాడా; నేడేలకో; యుద్ధమునకుపోవ మనసొప్పకున్నది. నీతో ఆనందముగా కాలము గడపవలెనని యున్నది.

హాడా:-(నడుమునకు ఖడ్గము కడుతూ) నాథా! సర్వము తెలిసి అటుల అనుచున్నారేల? వీరులకు యశస్సు ముఖ్యముగాని తుచ్ఛప్రేమగాదు. స్వగృహమునుకాదు.

చందావత్:-హాడా! సరే! పోవుచున్నాను. శత్రువులు మహాబలవంతులు, ఎట్టికష్టములోనైనా, మన వంశగౌరవము కాపాడుదువని తలచెదను.

(చందావత్ నిష్క్రమణ)

(హాడా గదిలో విచారంగా ఆలోచిస్తూ ఉంటుంది. చెలికత్తెలు మాలనుగుచ్చుతూ ఉంటారు.)

హాడా:-ఆహా! ప్రేమ ఎంతగ్రుడ్డిది. నానాథునికే నాపై ఎంత అనుమానము జనించినది. వారికి దేశరక్షణ, ఎటువంటిదో నాకువంశమర్యాద కాపాడుట అటువంటిదని ఎరుగరు కాబోలును. (ఎదురుగా చూస్తూ) గురువర్యా; నమస్కారము.

గురువు:-(రెండుచేతులు పైకెత్తి) దీర్ఘసుమంగళీభవ.

హాడా:-గురువర్యా! మీరాకకు కతనము.

గురువు:-పర్వదినముకదా, పతివ్రతాధర్మము చెప్పుటకు. ఇది సర్వసైన్యాధిపతి ఆజ్ఞ.

హాడా! (కోపంతో) చాలు! గురువర్యా! మీరేమియు చెప్పనవసరములేదు. (పట్టరాని దుఃఖముతో ఎదురుగా ఉన్న కాళీవిగ్రహము దగ్గరకుపోయి) తల్లీ! కాత్యాయినీ! ఏల, నన్నింత కళంకినిగాజేతువు. నాభర్తనాపై వ్యామోహముచే, తన కార్యము మరచునేమో, ఇప్పుడేదిగతి, హుం! మరచితిని. (గురువువైపు

చూచి) గురువర్యా క్షమింపుడు. (గబగబా ఉత్తరము వ్రాసి) తల్లీ! రాజపుత్రవంశమును, భర్తను రక్షింపుము. (అంటూ మొలనున్న కత్తినితీసుకొని ఒక్కమారుగా నరుకుకొనును. శిరము దేవిపాదములపైబడును. రుధిరము ఎత్తుగాస్రవించి, కాళీవిగ్రహమును అభిషేకించును.)

3

(రూపనగర మైదానమందలి గుడారములలో, చండావత్, కొందరు సర్దారులు, మంతనము చేయుచుందురు.)

సర్దారు:-ప్రభూ! యీదినము విచారముగా నుంటిరేల?

చండావత్:-నేడేలకో! మేవాడ వోవ నిచ్ఛ జనించుచున్నది.

సర్దారు:-రూపనగరముసంగతి తెలియకుండగనే?

చండావత్:-ఏమైననేమి, పోకతీరదు. (పైనుండి పురోహితుడు రక్తసిక్తపు మరకలతో ఉత్తరము పట్టుకొని ప్రవేశము) (చండావత్ ఉత్తరము అందుకొని వడకుచున్న చేతులతో జాబుచూచి) హా! హాడా! ఎంత ఘోరము చేసితివి. నీపైగల ప్రేమవలన అటులచేసితినిగావి, వేరుకాదు. (పండ్లుకొరుకుతూ) అనుమానపిశాచము ఎంత దారుణనాటక మాడించినది. (ఉద్రేకంతో) సైనికులారా! హాడా ఉపదేశమే మనకు రక్ష, రెండు! మనకర్తవ్యము పాలన సేయుదము.

(అందరూ ఆయుధములు దూసికొని రూపనగరముపైకి పోవుదురు, మేవాడపతాకము గాలిలో వినురున ఎగురుతూ ఉంటుంది.)

(సరి)

# రేడియో ప్రసంగము

శ్రీమతి అల్లాడి అన్నపూర్ణమ్మగారు.

4-2-47

కథలంటే పిల్లలకు చాలా ఇష్టం అన్నమాట అందరికీ తెలిసిందే. "ఏదైనా కథ చెప్పవూ?" అని వాళ్లు పెద్దలను ఎప్పుడూ అడుగుతుంటారు. అన్నం నిద్రకూడా అవసరంలేకుండా వాళ్లుకథలను వినడం మామూలు. విన్నకథనే వింటారు. వారికి విసుగులేదు. మొండిపట్టుపట్టిన పిల్లలనూ, నిష్కారణంగా ఏడుస్తుండే పిల్లలనూ, కథలుచెప్పి వశంచేసుకోవడం పెద్దవారికి సహజం. కథలనుచెప్పి మనంపిల్లలను నిద్రపుచ్చుతుంటాం. పిల్లల ఆదరణ, అభిమానం, గౌరవం సంపాదించడానికి ఇంతటిగొప్ప సాధనం లేదని చెప్పవచ్చును. అందుచేతనే ఇతరదేశాలలో ఉన్నట్లే మన ఆంధ్రదేశంలో పిల్లలకథలెన్నో ప్రచారంలో ఉన్నాయి.

ఈకథలు అనేకరకాలు. పిట్టకథలు, పేదరాసి పెద్దమ్మ కథలు, తెనాలిరామకృష్ణునికథలు, పరమానందశిష్యులకథలు, తాతాచార్లకథలు ఆంధ్రదేశంలో ప్రత్యేకంగా ప్రసిద్ధిగాంచి వున్నవి. ఇవికాకుండా రామాయణం భారతం భాగవతం మొదలైన పురాణ ఇతిహాసాలలోని కథలను ఎన్నిటినో మనం మనపిల్లలకు చెప్తుంటాం. విక్రమార్కుడు భోజుడు మొదలైన రాజులకు సంబంధించిన కథలు కూడ ప్రచారంలో ఉన్నవి. నీతిచంద్రిక, పంచతంత్రం మొదలైన గ్రంధాలలో చెప్పబడ్డ కథలును పిల్లలకుచెప్పడం మామూలు. ఇప్పుడిప్పుడు మనదేశ చరిత్రకు సంబంధించిన కథలుకూడ ప్రచారంలోకి వస్తున్నవి.

పిట్టకథలు చాలా చిన్నకథలు. ఇవిపిల్లలకు చాలా సులభంగా బోధపడ్తవి. ఇవిచాలాచమత్కారంగా ఉంటవి. వీటిలో మనుష్యులేగాక మృగాలు పక్షులు, భూతములు, పిశాచములు-అన్నికనిపిస్తుంటవి. చిన్నపిల్లలకు చెప్పేకథలన్నీ ఈపిట్టకథలతోనే ప్రారంభం అవుతవి. వీటిలో కొన్నిటియందు గొప్పవిషయం ఏమీలేకపోవచ్చు. అయినా అవిపిల్లల హృదయాలను ఆకర్షిస్తవి. వారిమనస్సులకు చాలా ఇంపుగా ఉంటవి. వాటిలో అనేకాలలో హాస్యరసం ప్రధానంగా ఉంటుంది. కథంతావిని పిల్లలు గట్టిగా నవ్వుతారు. సాధారణంగా రాజుకొడుకులు ఏడుచేపలను వేటాడడం అనే కథను పిల్లలకు మొదట చెప్తుంటారు. ఏడ్గురుకొడుకులు అడివికి వేటకువెళ్లి చేపలను తెస్తారు. చేపలను వేటాడడం ఏమిటీ అన్న సందేహం పిల్లలకు పుట్టనే పుట్టదు. వారిభావనా ప్రపంచంలో అన్నీ జరుగుతుంటాయి. సాధ్యం అసాధ్యం అన్న భేదం లేదు. చేపలను ఎండబెడ్తారు, ఒకచేప ఎండదు. ఏమేచేప ఎండావుకావు? అని వారడుగుతారు. గడ్డిదుబ్బ చాటువచ్చిందని అది జబాబుచెప్తుంది. ఏమిదుబ్బ, చాటొచ్చావు అని అంటారు. ఆవుమేయలేదని దాని జబాబు. తరువాత పశువులకాపరి, అంబలిపెట్టే అవ్వ, ఏడ్చినపిల్ల అందరు వస్తారు. కొసకు చీమకుట్టడం చేప ఎండకపోవడం కారణం అవుతుంది. "నాబంగారుపుట్టలో వేలుబెడ్తే నేనుకుట్టనా" అంటుందిచీమ. అందరూ ఆమాటవినగానే నవ్వడం తప్పదు. కథరాజుతో ప్రారంభం అయింది, చీమతో ముగిసింది. మధ్యన ఎన్నోపాత్రలు వచ్చాయి. గడ్డి, దుబ్బా, ఆవు, చీమ, చేప-ఇవన్నీ మాట్లాడగలవా అనేసందేహం ఏపిల్లకూ లేదు. కథచాలా ఇంపుగా ఉంటుంది. ఇంపుగావుండడమే పిల్లలకథలకు ప్రధానలక్షణం.

ఏయేకులం వారికి ఏవిప్రధానమైన గుణాలో ఈపిట్టకథలలో వివరిస్తుంటారు. చమత్కారం అంతా అందులోనే ఉంటుంది. కోమట్లయుక్తి, బ్రాహ్మణుల చేదస్తం, రాజులక్రోధం, గొల్లలమాఢ్యం, మంత్రుల ఉపాయం-ఇవన్ని ఈపిట్టకథలలో ప్రతిఫలిస్తుంటవి. నవ్వుపుట్టడానికి ఇదే కారణం. మీరంతా "పురిపిట్ట" కథను విని ఉంటారు. రాజు వేటాడి అలసిపోయి ఒకవెలగ చెట్టుక్రింద కూర్చుంటాడు; చెట్టుపైన వెలగ పండుతింటూ పురిపిట్ట వుంటుంది. వెలగపండొకటి ఇయ్యమని రాజు అడుగుతాడు. పిట్టపండులోని గుజ్జు అంతాతిని పెంకును రాజుపై పడవేస్తుంది. రాజుకు ఎక్కడలేని కోపంవస్తుంది. వేటకానిచేత దానిని పట్టించి బురదగుంటలో వేస్తాడు. తర్వాత చాకలిపొయ్యిలో తోస్తాడు. తర్వాత ఎన్నోఘట్టాలున్నవి. కొసకు పిట్ట అన్నిట్నీ తప్పించుకొని సుఖంగా ఉంటుంది. ఏలాగున్నావని రాజు అడిగితే "వెలగచెట్టెక్కాను, వెలగపండు తిన్నాను, వెలగపెంకు రాజుపై వేశాను, బురదలో బురబురలాడాను, చాకలిపొయ్యిలో చలికాచుకొన్నాను, తాతతో దడి అల్లాను, అవ్వతో పిండి దంచాను. రాజు నోట్లో మట్టికొట్టాను." అంటుంది. ఇదివినగానే పిల్లలంతా ఫక్కున నవ్వుతారు.

ఈపిట్టకథలు లెక్కలేకుండా ఉన్నవి. జంతువుల స్వభావాన్ని ఇందులో వివరిస్తారు. నక్కజిత్తుల మారితనం, సింహం యొక్క గాంభీర్యం, యజమానుని యందు కుక్కల కుండే నెనరు, కోతుల అస్థిరత, అన్నీ ఈకథలలో కనుపిస్తుంటవి. మాంసపుముక్కను నోటిలో ఉంచుకొన్నకాకిని నక్కబావ స్తోత్రపాఠం ద్వారా మోసంచేస్తుంది. ఎలుక సింహానికి సహాయం చేస్తుంది. కొంగతపస్సు చేసినట్లునటించి చేపలను భక్షిస్తుంది. ఈలాటికథలెన్నో. ముఖ్యంగా నీతిచంద్రిక పంచతంత్రాలలో ఇట్టికథలనేకములున్నవి. వీటిలో కూడా హాస్యరసం ప్రధానంగా ఉంటుంది. ఇవన్నీ నవ్వుపుట్టించే కథలే. వీటిని మనంమన పిల్లలకు చెప్తుంటాం.

ఆంధ్రదేశంలో పిల్లలకు చెప్పేకథలలో అనేకాలలో పేదరాసిపెద్దమ్మ అనేపాత్రవస్తుంటుంది. ప్రతిపట్నంలో గొప్పరాజొకడు ఉన్నట్లే ఒకపేదరాసిపెద్దమ్మకూడా ఉంటుంది. పట్నంలోకి ఎవరైనా కొత్తవారు వస్తే, ఈమె, ఇంట్లోనే బస. పట్టణంలోని వృత్తాంతం అంతా ఈమెకు తెలిసి ఉంటుంది. ఇంతేకాకుండా ఈమె చాలా ఉపాయశాలి. ఎంతటి అసాధ్యమైన కార్యాన్నైనా, సాధించుటకు ఏదోమార్గం కనిపెడ్తుంది. ఏసందేహం ఉన్నా దానిని తీర్చుకోడానికి ఇతరులు అమెదగ్గిరకు వస్తుంటారు. తుదకు ఇల్లలుకుతూ తనపేరు మరచిపోయిన ఈగ కూడా పేదరాసిపెద్దమ్మ వద్దకు వచ్చి తనపేరేదో అడుగుతుంది. ఈపెద్దమ్మ గొప్పవ్యక్తి. రాజుకూతురిని పెండ్లిచేసుకోడానికి వచ్చిన రాచకుమారుడు కూడ ఆమెపంచలోనే బస చేస్తాడు.

మనం మనపిల్లలకు చెప్పేకథ లనేకాలలో తెనాలిరాముడు వస్తుంటాడు. తెనాలిరాముడి కథలలోకూడా హాస్యరసం ప్రధానం. ఇతరులను యుక్తిచేత ఉపాయంచేత వశరచుకొని తనయుద్దేశాలను సాధించుకుంటుంటాడు తెనాలిరాముడు. తుదకు కాళికాదేవిని కూడా ఇతడుమోసం చేస్తాడు. ఆమె ఒకచేతిలోపాలు మరొకచేతిలో పెరుగుతెచ్చి, ఈరెండింటిలో ఏదో ఓకట్టితీసుకో; పాలుతీసుకుంటే ఐశ్వర్యం వస్తుంది. పెరుగుతీసుకుంటే పాండిత్యం వస్తుంది అని అంటుంది. అంతట అతడు రెండూతన చేతికి ఇవ్వమని అంటాడు. ఇవ్వగానే ఏదోఒకదానిని త్రాగడానికి బదులు రెండూత్రాగుతాడు. త్రాగి

క్షమించవలసిందని కోరుతాడు. మరొకప్పుడు కృష్ణదేవరాయలకు గురువైన తాతాచార్లను మాయచేసి అతనిభుజములపై కూర్చుండి ఊరంతా ఊరేగుతాడు. పరమానందాయ శిష్యుని కథలు కూడ ఇట్టిహాస్యరస ప్రధానములే.

ఇవిగాక పురాణ ఇతిహాసములనుండి చిన్నపిల్లలు గ్రహించలేరని మనం అనుకోకూడదు. శత్రువులిద్దరు ఒకరితో ఒకరు యుద్ధంచేసుకోవడం వారి అనుభవాలకు అతీతంకాదు. పిల్లలమధ్య సాధారణంగా యుద్ధాలు జరుగుతునే ఉంటవి. "కట్టె, కొట్టె, తెచ్చె" అనేమూడు మాటలతో రామాయణం కథనంతను వారికిచెప్పవచ్చును. రాముని వనవాసం, రావణుడు సీతనపహరించడం, హనుమంతుడు సీతనువెదకుచు లంకాపట్టణాన్ని దహించడం-ఈలాంటి ఘట్టాలను పిల్లలు చక్కగా గ్రహించగలుగుతారు. ఇట్లేభారతంలో దుర్యోధనభీములకు మధ్యన వైరం, కర్ణార్జునుల వైరం, అభిమన్యునిశౌర్యం, ఘటోత్కచుని సాహసం, కురుక్షేత్రయుద్ధం-ఇవన్నికూడ పిల్లలమనస్సులకు నచ్చునట్లుచెప్పవచ్చును. పిల్లలకు పిన్నవయస్సునందుండు వారిచర్యలు మిక్కిలి ఆకర్షణీయములుగా ఉండును. కృష్ణలీలలు, పెరుగును వెన్నను అతడు దొంగలించుట, పూతనను చంపుట, మొదలైన కథలు వారికి మనోహరములుగ నుండును. ప్రహ్లాదచరిత్ర, ధ్రువచరిత్ర, మొదలైనవి కూడ ఇట్టివే.

పురాణకథలను పిల్లలకు చెప్పుటలో ఒకవిషయమును గమనించవలెను. మనదేశపు సాంప్రదాయములు మనవిజ్ఞానము-ఇవన్నియు పురాణగాథలద్వారా మనము తెలుసుకొనవలసియున్నది. మనజాతియందు మనపిల్లలకు గౌరవము కలుగవలయు ననిన పురాణకథలను వినుటయే దానికిసాధనము. ఈకథలు సత్యములా కావా అన్నవిషయము అసంగతము. అట్టి అనుమానము చిన్నపిల్లలకు ఉండదు. పెద్దవారైన తర్వాత అట్టిసందేహము వారికి కలుగవచ్చును-కాని అప్పుడు వారు దానికి తగినసమాధానము చెప్పగలవారగుతారు.

ప్రస్తుతకాలములో పిట్టకథలు, పేదరాసి పెద్దమ్మకథలు, తెనాలిరామునికథలు, పురాణకథలుకాక, ఆంధ్రదేశమునకును ఆంధ్రదేశచరిత్రకును సంబంధించిన కథలనేకములను పిల్లలకు చెప్పుట అవసరము. కొంతవరకు మనపాఠశాలలలో ఇదిజరుగుతున్నది. దేశమును గురించి, నదులూ, పర్వతములూ మొదలైన వాటిని గురించి, స్థలపురాణముల ద్వారా అనేక కథలను కల్పించవచ్చును. అట్టికథలను సమకూర్ప వలసియున్నది. ఇదిగాక చరిత్రకు సంబంధించిన మహాపురుషు లనేకులున్నారు. ఆంధ్రచక్రవర్తులు, కాకతీయులు, రెడ్డిరాజులు, చాళుక్యులు, విజయనగర సామ్రాట్టులు-వీరనేక ఘనకార్యములనుచేసి, మన మన అభివృద్ధికి సర్వతో ముఖముగ తోడ్పడిన వారు. వీరిచరిత్రను వివరించు కథలనేకములు కలవు. వాటిని గూడ పిల్లలకు చెప్పివారి దేశాభిమానమును వృద్ధిచేయవలెను.

గనుక సారాంశం ఏమిటంటే చిన్నపిల్లలకు మనోరంజకములైన కథలను మనము చెప్పుచుండవలెను. వారి అభ్యుదయమున కిదిప్రధాన సాధనము. ఇందుకై అనుశ్రుతముగ వచ్చుకథలను ఉపయోగించుటయేగాక, క్రొత్తకథలను కూడ మనము కల్పించ వలసియున్నది.

(ఆలిండియా రేడియోవారి అనుమతిని)

——:o:——

# స్త్రీల వాఙ్మయము.

(సంపాదకులు: శ్రీ ఏ. ఎల్. యన్. శాస్త్రీగారు, బి. ఏ.)

పూసపాటివారి లోగిళ్లలోనూ
పురివిప్పి ఆడింది పుణ్యాంపు నెమలి;
భాగ్యపాటివారి లోగిళ్లలోనూ
పాల్తాగి ఆడింది పట్టె అమ్మన్న!

పదంపదం పాడుకో;
పరమేశునేలుకో;
కొడుకు పుడితే ఎత్తుకో;
కోడలువస్తే మొత్తుకో.

తోటికోడలునాకు తోడాయెనమ్మ
దొంగతిళ్లకు మాకు సందాయెనమ్మ.

కోడలా! కోడలా! కొడుకు పెళ్లామా!
పచ్చిపాలామీద మీగడా ఏది?
వేడిపాలామీద వెన్నలూయేవి?
నూనెముంతలు మీద నురగలూ యేవి?
అత్తరో, వోయత్త! ఆరళ్ల అత్త!
పచ్చిపాలామీద మీగడుంటుందా?
వేడిపాలామీద వెన్నలుంటాయా?
నూనెముంతలమీద నురగలుంటాయా?
ఇరుగు పొరుగూలార! ఓచెలియలార!
అత్తగారారళ్లు చిత్తగించండి.
పెత్తనం లాగేస్తె పేచీలుపోను.

చెట్టుమీదికోతివలె బావ వున్నాడు
చెరువులో చేమంతివలె అక్కవున్నాది!

# శ్రీమతి అరుణ అసఫాలీ



భర్త అసఫాలీ అమెరికాకు
భారత దేశపు ప్రతినిధిగా వెళ్లియున్నారు.
'నా పని ఇక్కడనే ఉన్నది' అని
భారత సోషలిస్టు పార్టీలో ముఖ్యు
రాలై భారత స్వాతంత్ర్యం
కోసం యువతీ యువకులలో
తీవ్రంగా సంచలనం
కలుగ చేస్తున్నది.



కొత్త మద్రాసు మంత్రివర్గసభ్యులు: ప్రధాని శ్రీ ఓమాందూరి రామస్వామి రెడ్డియార్ (కూర్చున్నవారు), శ్రీ హెచ్. సీతారామ రెడ్డి, శ్రీ కె. మాధవమీనన్, డాక్టర్ టి. యస్. యస్. రాజన్, డాక్టర్ సుబ్బరాయన్, శ్రీ యం. భక్తవత్సలం, శ్రీ కళ్లూరి చంద్రమౌళి, శ్రీ బెజవాడ గోపాలరెడ్డి (నిలుచున్నవారు—ఎడమనుంచి కుడికి వరసగా)

# శ్రీదేవి నవనీత హృదయము.

శ్రీయుత. కె. చెన్నరాయఁడుగారు. (విద్వాన్) తిరుపతి.

మంగయ్య పల్లెటూరి మనిషి. మాయ మర్మము లెరుగని పేదవాఁడు. దేవుడిచ్చినదే దివ్య ప్రసాదమని తిని సంతోషించు వాఁడు. లేని దానిని కోరఁడు. దైవమే రక్షించు వాఁడని దైవమును నమ్మి పూజించువాఁడు. దేవుఁడు మంగయ్యకు లేక లేక నొక కూతురు నిచ్చియున్నాఁడు. ఆ అమ్మాయిపేరు బాలమ్మ. వయస్సు -12 సం వత్సరములు. బాలమ్మ, బాల చంద్రునికంటె చక్కని చుక్క. మంగయ్య హరిజనుఁడైనప్పటికిని నాగరికత తెలిసిన పెద్దమనిషి. తల్లిలేని ముద్దుబిడ్డను బాలమ్మను యెంతో అల్లారు ముద్దుగా పెంచుకొన్నాఁడు . తన బాలమ్మే తనప్రాణ మని నమ్మియుండువాఁడు.

గోదావరి సమీపములో రామాలయ మొకటున్నది. ఆదేవుని యుత్సవము తనివిదీరఁజూచి చేసిన పాపములను పోఁగొట్టఁ దలఁచినాఁడు. అప్పుడు నిండువేసవికాలమైనను, వెంటనే బాలమ్మను, వెంటతీసుకొని, మంగయ్య దారిబట్టినాడు. తొందర లేకనడచి నడచి, యెట్లో, మిట్టమధ్యాహ్నమగుసరికి 10. మైళ్లునడచి నారు. ఎండబాధ యెక్కువైనది. నిప్పుల మీద నడచి నట్లున్నది. మంగయ్య ధీరుడు గనుక కష్టమును లెక్క బెట్టలేదు.' కాని బాలమ్మ బాధకై బాధపడ వలసి వచ్చినది. నడచి నడిచి బాలమ్మకు కాళ్లునొచ్చుట యేగాక, నాలుక తడియారఁ జొచ్చె. నాయనా! నోరెండుక పోవుచున్నది; నీళ్లు కావలయు నన్నది. జనసంచారము లేని ఆప్రదేశములో పాపము మంగయ్య నీళ్లెక్కడ తేగలడు? కొంచెమోపిక బట్టుము తల్లీ! దగ్గరలో నొక పల్లెటూరు యున్నట్లు తెలియు చున్నది. అక్కడ పుణ్యాత్ములు నీదాహము తీర్చగల రన్నాడు మంగయ్య. అన్నము లేకున్నను ఆగవచ్చును. కాని "నీరే ప్రాణాధారము"గదా! నీరులేకుంటే ప్రాణ మెట్లుండును? పాపము యెట్లో కొనయూపిరితో రెండు మైళ్లునడిచినారు. చేరవలసిన చోటు ఇంక మూడుమైళ్లుమాత్ర మున్నది. బాటలో నొకపుణ్యాత్ముడు, దప్పి గొన్నవారికి, మజ్జిగ, చల్లటి నీరునిచ్చుటకు చలిపందిరి బెట్టియున్నాఁడు. అది చూచి చూడగనే మంగయ్యకు పంచప్రాణములు లేచివచ్చినవి. మంగయ్య పరమానందముతో, చేతులెత్తి నమస్కరించి, స్వామీ! నీరిచ్చి బిడ్డను రక్షించండి, అని ప్రార్థించినాఁడు. ఆ పెద్దమనిషి నీదేమి కులమన్నాఁడు. స్వామీ ప్రాణములు నిలువవు. నీరు యివ్వండి. కుల మెందుకు స్వామీ! ఏదో! అడిగితిరి. నేను మాలవాడ నన్నాఁడు మంగయ్య. మాలయనగానే, ఆపెద్దమనిషి గుడ్లెఱ్ఱఁజేసి, సిగ్గులేని మాలపీనుగ! దూరము పో! పో!! నీకిక్కడ నీళ్లుపోయరు. దగ్గఱలో యూరు యున్నది. పో! పోతావా? లేదా! ఊఁ కదలకున్నావే? అని గర్జించినాఁడు, అరాయి వంటి గుండెగల పెద్దమనిషి.

మఱుమాటాడితే, యేమిచేయునో, బాలమ్మ కేమి ప్రమాద మగునోయని మంగయ్య మౌనము వహించి నాఁడు. "చిన్నగా నడుతల్లీ! దగ్గఱలో యూరున్నదట. అక్కడైనా పుణ్యాత్ము లుండక పోరు. ఇక్కడ పెద్దకులము వారికే నట నీరు. ఎవరొనర్చిన కర్మ వారను భవింపక తప్పదు గదా! దేవుఁడు

మమ్ము అంటరాని వారినిగా యెందుకు పుట్టించినాఁడో? దేవునికే దయలేనప్పుడు మానవుల కుండునా?" అని మంగయ్య తన అదృష్టమును నిందించు కొన్నాఁడు. మెల్లగా తండ్రి బిడ్డ, లోక అగ్రహారము చేరుకొన్నారు.

అక్కడ గొప్ప యింటి వివాహము జరుగు చున్నది. వద్దు వద్దనెడి పెద్ద పెద్ద వారికి పెట్టు పెద్దమనిషి. ఆయన. తిని యెక్కువైతే, పార వేయుదురు గాని పేదల కనికరించు గొప్పవారు కారు. అట్టి గొప్ప తనము కాల్పనా? స్వామీ! దాహ మంటూ మంగయ్య గొప్ప యింటికి వెళ్లినాఁడు. ఆ పెద్దమనిషి మంగయ్య వేషము చూచి, ఎవరు మీరన్నాఁడు. మంగయ్య మాలల మన్నాఁడు. ఛీ! మాలకుంకా! పెండ్లి సమయము లోనా నీదర్శనము? ఈ అగ్రహారములో నీ కెవ్వ రేమియు పెట్టరు, ఊర్లోకిపో! అని తలుపు వేసినాఁడు. మంగయ్య రామా! అంటూ, సొమ్మసిల్లి పోతున్న బాలమ్మను పట్టుకొని మెల్లగా పోతున్నాఁడు. నాయనా! నేనింక నడువ లేను. నీళ్లుకూడా వద్దు. ఇక్కడనే కూర్చుంటానన్నది బాలమ్మ. మంగయ్య బిడ్డ బాధను చూడలేక, లో లోపల దుఃఖములో కుమిలి పోవు చున్నాఁడు. అయ్యో! ప్రాణము పోతున్నను, అయ్యో! అను వారులేరే కనికరము లేని కులములు కాల్పనా? దేవుడా? అని బిగ్గఱగా అరచినాఁడు.

ఇంతలో పెద్ద మేడ మీద నుండి నొక భాగ్య వంతురాలగు యిల్లాలు మంగయ్యను, బాలమ్మను చూచింది. ఆమెకు అతిథులంటే ఆదరమెక్కువ. భాగ్యవంతులంటే అర్ధరాత్రి యైనను, కష్టమనక వండి పెట్టుతల్లి, కడుపు నిండినవారికి కావలసినంత పెట్టునారీమణి. వెంటనే సేవకునిపంపి వారిద్దఱిని పిలువ నంపి మీరెవ్వరని అడిగినది. ఎవరైతే నేమి తల్లీ! అయ్యో! అనువా రుండేగదా! మేము మాలల మన్నాఁడు మంగయ్య. శివ! శివా!! మాలలా! అగ్రహార ములోని కడుగిడరాదు. వీరిని దూరముగా గెంటి వేయ మన్నది- ఆనిర్దాక్షిణ్య రాలు. "యథారాజా తథాప్రజా" యని చచ్చిన పామును కొట్టినట్లు అసలే ప్రాణము పోతున్న, తండ్రిని బిడ్డను, కఠిన హృదయుఁడగు సేవకుఁడు దూరముగ గెంటి వేసి నాఁడు. అయ్యో అను వారేరీ?

మంగయ్య భాగవతము చదివినాఁడు. చెట్టుక్రింద కూలబడి, గజేంద్రుని ప్రార్థనను స్మరణకుఁదెచ్చు కొన్నాఁడు.

"లా వొక్కింతయు లేదు, ధైర్యము విలోలం బయ్యెఁ బ్రాణంబులున్
ఠావుల్ దప్పెను, మూర్ఛ వచ్చెఁ దనువున్ డస్సెన్, శ్రమం బయ్యెడిన్,
నీవే తప్ప నితఃపరం బెఱుఁగ, మన్నింపం దగున్ దీనునిన్,
రావే ఈశ్వర! కావవే, వరద! సంరంక్షించు భద్రాత్మకా!"

అని నిండుభక్తితో, యూపిరి యున్నంత వరకఱచి, ఆయాసముచేత మైమఱచి నాఁడు.

ఇంతలో గజేంద్రుని రక్షించుటకు వచ్చిన విష్ణుమూర్తి వలె, నొక అమ్మాయి ఆదారిని పాఠశాలకు వెళ్లుచు పడిపోయిన వీరిద్దఱిని చూచింది. ఆ అమ్మాయి పేరు శ్రీదేవి. పేరుకు తగినట్టి రూపముగల లక్ష్మీదేవి. సరస్వతికే చదువు నేర్పు నంతటి బుద్ధి నైపుణ్యము గల బాలికామణి. దేవుని ధ్యానింపక అన్నము తినదు. చీమ మొదలు కొని ప్రతి వారిని ప్రేమించునది. నేడు తండ్రిలేని బిడ్డ. తండ్రి వకీలు గనుక విద్యాబుద్ధులు చక్కగా చెప్పించినాడు. తన తల్లియగు దేవకమ్మ, శ్రీదేవి కనేక భాగవత, భారతముల లోని ధర్మనీతి కథలను బోధించినది. ఇప్పుడు అమ్మాయి 9 వ తరగతి చదువుచున్నది. వయసు 14 వత్సరము లుండును. ఇట్టి సద్గుణరాశి శ్రీదేవి వారిని చేతితో తాకి, మీరెవ్వరని, మిగుల జాలి గలిగిన హృదయముతో నడిగినది. ఆయాసముచేత మంగయ్య మాత్రము పలుక లేదు. బాలమ్మ కన్నులు తెఱిచింది. అమ్మా నీపేరేమమ్మా? అని శ్రీదేవి నడగినది, నాపేరు శ్రీదేవి. నీపేరేమమ్మా! ఏమి కావలయు నన్నది, శ్రీదేవి నిండారిన ప్రేమతో! దాహమమ్మా! అనినది బాలమ్మ? "జలముం బోసెను, రంతిదేవుఁడుదయం చండాల పాత్రింబునన్"అన్నట్లు. అయ్యో! పాపమని, తనమర చెంబులోని నీరు బాలమ్మనోట బోయు సమయమున, యొక సనాతన బ్రాహ్మణుఁడు చూచి, ఆయ్యో! పాపిష్ఠిదానా! ఆఁ!ఆఁ!! ఎంతపని చేయు చున్నావే? అంటరాని వారి నంటుచున్నావా? అంటూ శ్రీదేవి చెయిపట్టి లాగినాఁడు. పాత్ర క్రిందపడి నీళ్లన్ని క్రింద పోయినవి. బాలమ్మ "అమ్మా! శ్రీదేవీ!" అంటూ కళ్లుమూసికొన్నది.

క్రిందపడిన నీళ్లతడికి, మంగయ్య మేల్కొని బాలమ్మను లేపినాఁడు. అంటరాని వారెందుకీ లోకములో నని ప్రాణములు వీడిన బాలమ్మ లేచునా? లేవలేదు. మంగయ్య, దిక్కులేని పక్షివలె, దిక్కుతోచక బావురుమని యేడ్చినాఁడు. "ఎద్దుపుండు కాకికి ముద్దా?" పాపమయ్యో! అనువారెవ్వరు? ఈరాక్షస కృత్యమును జూడలేక, సూర్య భగవానుఁడు, రక్తమూర్తియై పడమటి కొండలచాటున కేగెను.

శ్రీదేవి హృదయము నూతన నవనీతము వంటిది. "నీపాద కమలసేవయు........ నితాంతాపార భూత దయయును తాపస మందార! నాకు దయసేయుగదే!" అని దేవుని నిత్యము ప్రార్థించునది. తనయెదుట జరిగిన ఘోరకృత్యమును చూచినప్పటి నుండి, ఆఅమ్మాయి హృదయములో శాంతిలేదు. రాత్రి నిద్దుర పట్టలేదు. ఎన్నివిధము లాలోచించినను, అంతరాత్మకు శాంతి చిక్కలేదు. మితిమీరి దుఃఖించినది. ప్రేమ, దయ, వాత్సల్యము లేని ఈలోకములో జీవించి లాభము లేదను కొన్నది. బాలమ్మ ఎక్కడికి పోయినదో! తాను కూడా అక్కడికి పోదలచు కొన్నది. పరిపరి విధముల అంతరాత్మతో యుద్ధమొనర్చినది. లాభములేదు. తుదకు బాలమ్మ సాహచర్యమే కావలయునని నిశ్చయించు కొన్నది. ఆరాత్రిదినమే జాబువ్రాసి, తనపడక మీదపెట్టి, ఆచల్లని వెన్నెలలో, గోదావరి నదీప్రాంతమున కేగి, గంగా దేవిని భక్తిమీర యిట్లు ప్రార్థించినది.

తల్లీ! భాగీరథీ! ఋషికుల సంభూత మగు పవిత్ర భారతాంబ గర్భమందు ద్భవించి, కరుణ లేని కాఠిన్య హృదయము గలిగి క్షణమైనను జీవింపఁజాలను. మానవులకు దయా ధర్మములను బోధింపుము. ప్రేమయే దైవమని బోధింపుము. సర్వజీవులొక్క యాత్మ స్వరూపమని తెలుపుము. నేను మాత్రము నాసోదరిని వీడి నిముస మైనను నిలువఁజాలను. నీచల్లని చూపులగు విశాల తరంగములలో లీనమొనర్చుకొని

నాసోదరితో జేర్చుము. అని గోదావరిలో లీనమైనది.ఆహా! శ్రీదేవి సాహసము! నిర్మల ప్రేమ!! భావమున కందనిది గదా!

తెల్లవారఁగనే దేవకమ్మ లేచి చూచినది, కన్నబిడ్డ శ్రీదేవి కనుపడ లేదు. శ్రీదేవి చెల్లెలు సరోజ ఊరంతా వెదికినది. ఎక్కడ కనుపడలేదు. బాలమ్మ యొద్దకేగిన శ్రీదేవి కనుపించునా? గోదావరిలో దాగిపోయిన సంగతి తెలియదు పాపము! శ్రీదేవి పడకమీద, తల్లికి జాబు దొరకినది, వణకుచు విప్పిచదివినది.

ప్రియమైన అమ్మా!

భయమందకుము! సోదరీభావము, దయ, వాత్సల్యము, ప్రేమ లేని యీలోకమును వీడి పోవుచున్నాను. ఆత్మ స్వరూప మంతట నిండి యున్నది. అందఱు మానవు లొకటే. అందఱు చైతన్య స్వరూపులని, యేనాడీ లోకము తెలిసికొని, యెక్కువ తక్కువలను వీడి ప్రేమతో సంచరించునో, అప్పుడు జన్మమెత్తి, నీఋణము తీర్చుకోగలను. తల్లీ! అంత వరకు నాతలఁపు వీడుము. గోదావరీ తల్లి యొడిలో లీన మగుచున్నాను. నాసాహసమునకు మన్నింపుము, నమస్తే.

ఇట్లు,

నీకూతురు,

శ్రీదేవి.

సముద్రమునకైన మేరగలదు కాని పొంగి పొరలివచ్చు దేవకమ్మ దుఃఖసముద్రమునకు మేరలేదు. దేవకమ్మ జరిగిన సంగతి యంతయు తెలిసికొన్నది. విచారించి లాభములేదు. గోదావరి శ్రీదేవి బంగారువంటి దేహమును మాత్రము బయట వేసినది. ఆత్మజ్యోతిని తనలో లీనముఁజేసికొన్నది. శ్రీదేవి పవిత్ర శరీరమును, బాలమ్మ దేహమును, దెచ్చి, ఒక్కచోట సమాధిఁ జేసిరి. పున్నమ చంద్రుని రాహువు కబళించినట్లు మృత్యు దేవత, బాలశ్రీదేవుల, యన్యాయముగ పొట్టన బెట్టుకొన్నది !

దేవకమ్మ, మంగయ్యల, మితిలేని దుఃఖమును చూడఁజాలక, సూర్యభగవానుఁడు మేఘములచాటుకేగెను.

——(0)——

కృతయుగమున దితి యదితులు
పతి దేవతలగుచుఁ బఱగిఁ పలువ్రతముల శ్రీ
పతిఁ గొలిచి సురా సురులఁ
క్షితిఁ గని వెలయింప జగతిఁ జెందె సమృద్ధిఁ.

తా. వేం. సు.

——(o)——

# నవోదయము

శ్రీమతి వద్దూరి మీనాక్షమ్మగారు, బందరు.

భావి భారత భాగ్యోదయమునకు స్త్రీలే మూలవిరాట్ స్వరూపులు. మానవులు వాడి నశించి పోతున్నట్లు కనిపించెడు కాలమునందు అవతరించిన నూతన శక్తుల ప్రతిభను, ప్రతిభావాతిశయముల మూలమున మానవజాతి తననైజప్రతిభను సువ్యక్తమొనరించి పెంపొందింప జేసుకొను సమయమే నవోదయ కాలము. ప్రాతక్రొత్తల కలయిక, పరస్పర విరుద్ధ భావముల సమ్మేళనము, మానవుల చిత్ర చిత్తసంచలనము-వీటిమిశ్రమముతో ఏర్పరుపబడిన నూతనవ్యవస్థయే అభ్యుదయపంథా. అప్పుడే నవోదయ మగును. ప్రకృతి పురుషుడు అన్నట్లు, దేశము గృహప్రాంగణము కూడ. దేశాభివృద్ధి గృహముయొక్క అభివృద్ధిని బట్టి భిన్నరూపములు తాల్చుచుండును. వాటికొక అవినాభావ సంబంధము కలదు. 'ఇంటగెలిచి రచ్చగెలువుము' అన్నయార్యోక్తి యదార్థము. గృహమునకు, యజమానులు స్త్రీపురుషులు; వారి యభివృద్ధిమీద గృహము, అటువంటి పెక్కుగృహముల అభివృద్ధిచే దేశాభివృద్ధి గూడ రూపొందుచుండును. నిజమాలోచించిన గృహంలో పురుషునకు రెండవస్థానం మాత్రమేలభించును. కనుక, మన భారాన్నంతటిని, స్త్రీమీదనే వదలి వేయవలయును. స్త్రీలేభావిపౌరుల కాదర్శ నారీమణులు. వారియొక్క చేష్టలను బట్టియు, సచ్ఛీల సంపన్నతను బట్టియు, శిశువులు అభివృద్ధి గాంచుచుందురు. అనగా వారి అభివృద్ధి నిరోధమునకు గూడ స్త్రీలే కారణభూతులు. కాన దేశాభ్యుదయమునకు, స్త్రీ అభ్యుదయము గూడ ముఖ్యకారణమనియు, రెంటిలో ఒకటి కారణము, మరియొకటి కార్యమనియు, రెంటి అభివృద్ధియే నూతనవికాసమునకు మార్గమనియు విశదమగుచున్నది. అటులయిన స్త్రీ ఎట్లుగృహమునకు, దేశమునకు గూడ తోడ్పడగలదను విషయము విచారించ వలసియున్నది.

ఒకానొకనాడు అతులితసంపదలతో తులదూగి రత్నగర్భయను నామముపహించి, ఇతరదేశములకు తన సంస్కృతిలో ఆదర్శప్రాయమై, సకలకళలతో విరాజిల్లి, ప్రఖ్యాతిగాంచిన సుభిక్షమగు భారతదేశము మనతరంలో సౌభాగ్యానికి బదులు, దుర్భరదారిద్ర్యంతో, స్వాతంత్ర్యంబదులు దాస్యశృంఖలములతో, నిరంతర వేదనతో దుర్భిక్షంగా రూపొందినది. కట్టుకొనుటకుబట్టకు, తినుటకు ఆహారమునకు గూడ నోచుకొనజాలక పోవుచున్నది. హిందూదేశమునకు మూలాధారములయిన గ్రామముల దుస్థితి గూడ వర్ణించ నలవి కాదు. ఇలాంటి దినాలలో, వీటికన్నింటికీ కారణభూతము లయిన శక్తులను అరికట్టి, వర్తమానాన్ని కదలించి లోకాన్ని ముందుకు తీసుకొనిపోవు మార్పులతో కూడిన దృక్పథం ఒకటి ప్రజానీకానికి అవసరం. అందులో పైనఁజెప్పిన కారణము మూలాన్ని స్త్రీ ముఖ్యపాత్రను ధరించి, అభివృద్ధినిరోధక మార్గముల ఛేదించి ఛేదించి, ప్రాచీన భారతఔన్నత్యమును పునఃప్రతిష్ఠించుట కర్తవ్యముగా ఎంచవలసి యున్నది.

అన్నిసమయములందు ప్రధాన శక్తులు ఆర్థికశక్తులు. వానిపైన జీవిత ప్రమాణము అధారపడి యుండును. దీనిపరిపూర్ణతకు, పూర్ణస్వరాజ్యము, దానిమూలమున అవలంబించెడు నిర్మాణకార్యక్రమములే ఆధారములు. అందులోను యంత్రపరిశ్రమలను స్థాపించుట ముఖ్యమైన విషయము. కాని ఇవన్నియు సమకూడి దేశము బాగుపడుటకు చివరకు ఒకపాతికవత్సరములేనియు పట్టునటుల తోచుచున్నది. అందుచే సాధ్యమైనంతవఱకు ప్రభుత్వము యొక్క జోక్యము లేకుండ ప్రతివారును తమకాళ్లమీద తామేనిలబడుటకు వీలుకలుగ జేసుకొనవలయును. పురుషుడు సంపాదించేది ముఖ్యావసరములగు, నివాసమునకు వసతి,

ఆహారము, వస్త్రములు మొదలగు వానికే ఒకప్పుడు చాలకయుండును. అప్పుడే స్త్రీ అవసరము కలుగును. అందుచే వారుకొన్ని పనులను చేయవలసియున్నది.

వారు పాటించ వలసినది ముఖ్యముగా మితవ్యయము, పొదుపున్ను. పొదుపుగలవారికే, ఋణబాధ లేకుండగ జీవితయాత్రను సలుపుటకు వీలగును. "నాయందు లక్ష్యమున్న వానినే, నేను లక్ష్యముగ జూతును" యని ధనదేవత చెప్పుచుండునని యొక సామెత కలదు. ధనము యెడల లక్ష్యమే పొదుపు. మితవ్యయము, పొదుపు విషయమై నొకమహనీయుడు యిట్లుచెప్పెను. "It is the daughter of wisdom the sister of temperance and the mother of freedom" అది వివేకమునకు కుమార్తె, మితమునకు సోదరి స్వాతంత్ర్యమునకు తల్లియై యున్నది. కృత్రిమ వేషభాషాచారముల పాటించుట యందు వ్యయముచేయుట, విలాసవస్తువులకై ఖర్చుచేయుట మొదలగునవి లేకుండ చూచు చుండవలయును పేదవారుగా నున్నంత మాత్రమున కష్టములను మఱచుటకుగాను మద్యపానములవాటు చేసుకొనుట తప్పు. ఇటువంటి వానియిందు మహిళామణులు శ్రద్ధవహించి ప్రచారముచేసి గీతములు పాడి, ఆచరణమునచేసి యితరులకుచూపి వాటినుండి, వారిని విముక్తులగునట్లుచేయ వలయును. గృహ ఆవరణములో, ఫలవృక్షములు, కాయగూరలు పండించు కొనుచుండిన, ఆయింటి వ్యయమును చాలవఱకు తగ్గించుకొని, ఆమిగిలిన ధనమును ఇతరావసర పదార్థముల మీద వెచ్చించుచుండిన, ఆరోగ్యవంతముగా, ఆనందదాయకముగా జీవించవచ్చును. మనభారత దేశములో చాలమంది ఉపయోగకరము కాని వానిమీద ఋణముచేసి వ్యయముచేయుట ఆచారమైయున్నది. ఉదా: వివాహసమయములందును, ఇతరకార్యములందును, దహనాదిక్రియలందును, అనవసరవ్యయమగుచున్నది. వీటిమూలముననే మనకందఱికి ఆయువుపట్టగు రైతు మిక్కిలి ఋణగ్రస్తుడగుచున్నాడు. వానిని ఆఋణమునుండి తప్పించుట మిక్కిలి కష్టసాధ్యమై యున్నది. తరువాత వరకట్నముల విషయము. వీటిమూలమున చాలమంది ఋణముచేసి దుర్భర సంతాప పీడితులగుచున్నారు. వీనినితొలగించుటకు విద్యావంతులైన మహిళలును, మహిళాసంఘములును నడుముకట్టి, వరకట్నములుపుచ్చుకొను వివాహముల జరుగనీయము అనిప్రచారముచేసి ఈవ్యాధిని మాన్పవలయును. తరువాత ముఖ్యమైనది చేతిపరిశ్రమలను గూర్చిన విషయము. దీని ననుసరించి గ్రామములను గూర్చికూడ విచారించ వలసియున్నది. హిందూదేశములోని జనాభాలో మూడవపాలుపైన గ్రామములలో నివసించుటచే, వాటిని గూర్చిన విచారణలో, దేశమంతటి స్త్రీల కర్తవ్యము అనునంశము ఆరోపించి ఆలోచించెదము. యూరపులో పారిశ్రామిక విప్లవము రాక పూర్వము ప్రజలు ఎక్కువభాగము వ్యవసాయము మీదనే ఆధారపడి యుండిరి. అదివచ్చిన తరువాత పరిశ్రమలలో జీవనోపాధి గల్పించుకొని దేశమును అభివృద్ధిజేసికొనిరి. కానిమన భారతదేశమున కంతటి భాగ్యముపట్టలేదు. పాశ్చాత్యుల నాగరికత మహిమమూలమున. మన ప్రశిద్ధమైన చేతిపరిశ్రమ లడుగంటి పోయినవికాని, యంత్రపరిశ్రమలు మాత్రము మనదేశములో స్థాపితమవలేదు. అందుచే చేతిపరిశ్రమల మీదజీవించుచుండిన జనము యావత్తు వ్యవసాయము దెసమరలిరి. వ్యవసాయము అంతమందికి జీవనోపాధి సమకూర్పజాలదు. సమకూర్చినను సంవత్సరము పొడుగునా సమకూర్చదు. అందుచే నేడుగ్రామము లన్నియు దుర్భరదారిద్ర్యములో మునిగి లేవనశక్తులై యున్నవి. ఇక రైతుఋణమును గూర్చినుడువ నవసరము లేదు, అటువంటివారికి మహాత్ముడు వరప్రసాదముగా రాట్నము సమకూర్చినాడు. వ్యవసాయమునకు

కాలముకాని తక్కినకాలములందు రాట్నమిచ్చు భాగ్యము రైతున కింతింత యనిచెప్పఁజాలము. అటువంటి సమయమున స్త్రీలందఱును తమయిండ్లలో రాట్నములు వడకుచు, తమభర్తలచే ఆపనినిఁజేయించుచు, గ్రామస్థులకందరికిని దానియుపయోగములను దెలిపి వారిచేత ఆపనియందు నిమగ్నులగాఁజేయుట ముఖ్య కర్తవ్యమైయున్నది. యంత్రపరిశ్రమల మూలమున ఈలోపమును నివారణ చేయవచ్చునందురు. కాని అవి నెలకొల్పుటకు చాలకాలము పట్టునను సంగతి ప్రథమముననే చెప్పితిమి. అందుచే ఈనడుమ గడువులో సులభముగా సంపాదించగల ఈరాట్న పరిశ్రమయందు మహిళలు శ్రద్ధవహించుట తప్పనిసరియై యున్నది. దీనిమూలమున ఒక్కతన కుటుంబమేగాక ఇతరకుటుంబములను, దేశమునుగూడ ఉద్ధరింపవచ్చును. ఇది యొక్కటియేకాదు. ఇతరచేతి పరిశ్రమలను గూడ అవలంబించుచుండ వలయును. వానిలో కుట్టు మొదలగునవి ముఖ్యమైనవి. గ్రామోద్ధరణము, వీనిసహాయమున మహిళామణులందఱు చేయుటకు వీలగును. 'Rural India is Real India' అనువిషయము మఱవకూడదు. ఇవన్నియు, తీరికసమయములలో లేదా తీరిక చేసుకొని, స్త్రీసంఘములన్నియు కట్టుకట్టి పాటుపడవలయును.

(సశేషము)

—(o)—




అమ్మా అమ్మా! ఆడుకోంది కే,
పప్పు బెల్లాల్- పంచి ఇవ్వవే-
పంచదార--ముక్కలివ్వవే-
అక్కా- నేను ఆడుకుంటాం.

అక్క నీవంతు అటుకులు తేవే;
పిన్నీ నీవంతు పిడతలు తేవే;
చెల్లీ నీవంతు చెంబులు తేవే;
వంతు లాటలూ-వప్పుగ ఆడుదాం.

నాన్నగారు నగలు తెస్తే,
తల్లి బొమ్మకి నీళ్లుపోసి,
పిల్ల బొమ్మని ప్రక్కనే పెట్టి,
పప్పు బెల్లాలు- నంచుకో బెట్టి
ఉయ్యాలలో జోల పాడుదాం.

"ఉఫ్- ఉఫ్- ఉఫ్-ఉఫ్-
పొయ్యి మండితే కళ్లేమండవు;
బొమ్మపడుస్తే- నీళ్లేకారవు
అన్నం ఉడికితే ఆకలేవెయ్యదు.

నాన్నగారు నవ్వుతూవస్తే,
బొమ్మరింట్లో పీటవేసి,
బొట్టుభరిణ ప్రక్కనే బెట్టి,
అంటాకులో అరటి పళ్లతో-
వెండిగిన్నెలో వేడిపాలతో
వడి వడిగా వడ్డించేసి
వంతు లాటలూ వప్పుగ ఆడుదాం.

అంటూ, ఎంగిళ్లు, అన్నీ చేసి
ఇల్లు అలికి, ముగ్గులుపెట్టి
సామానంతా, చక్కపెట్టి
గ్రామఫోనుతో, గంతులువేదాం.

కే. వి. ఉమామహేశ్వరరావు.
బరంపురం.

# శ్రీ దేవీ గాయత్రి - ఆమె అద్భుత లీలలు

శ్రీమతి ఆగుమభట్టు నాగభూషణమ్మగారు, బట్లమగటూరు.

సృష్టికి పూర్వము సచ్చిదానంద బ్రహ్మాత్మకంబగు దేవి యొక్కతెయే యుండెను. ఆదేవియే గాయత్రి యనియు, త్రిపురసుందరియనియు, లలితయనియు, దుర్గయనియు, అవ్యక్తమనియు, సదాశివుడనియు, చంద్రకళయనియు, పరమాత్మయనియు, అనేక విధములుగా వక్కాణింప బడుచుండెను. అది అద్వితీయము. ఆ అవ్యక్తమునుండి ఈశ్వర శక్తి పుట్టెను. ఆ ఈశ్వరశక్తి వలన మూడుబ్రహ్మాండములు జనించెను. గుణత్రయముగ నుండి పురుషలీలలతో గూడిన బ్రహ్మ విష్ణు మహేశ్వరులును, లక్ష్మి గౌరీ సరస్వతులును అవతరించిరి.

దేవీ భాగవతము నందలి పంచమస్కంధము పందొమ్మిదవ యధ్యాయమునందు- "ఓతల్లీ నీశక్తిచేతనే బ్రహ్మ విష్ణు రుద్రులు సృష్టిస్థితిలయములు చేయుచున్నారు. కాని నిన్నువిడిచిన వెనువెంటనే వారట్లొనర్ప నసమర్థులు. ఇట్లు సృష్టి స్థితి లయములు చేయుదానవు నీవే. సర్వ రూపములు నీవే. నీవులేని దెవ్వరు నేమియు చేయజాలరు. దుష్టతరమైన కలియుగమున మనుజులు దుష్టులచే వంచింపబడి నిన్ను సేవింప లేక నీచేనిర్మింపబడిన త్రిమూర్తులను సేవించుచుందురు. దేవతలు రాక్షసులచేత పీడింప బడి నీచే రక్షింపబడిన దేవతలే అని తెలిసియు ఆదేవతలనే సేవించు చుందురు. హరి హర బ్రహ్మాదులే నీపాద పద్మములను సేవించు చుండగా అల్ప జీవులగు నరులు సర్వ సుఖముల నిచ్చు నీసేవను మానతగునా?" అని దేవత లందరు పొగడ నాయాదిశక్తి ఆశక్తిస్వరూపిణి, ఆగాయత్రి "మీకసాధ్యములగు కార్యములు తటస్థించినపుడు నన్ను స్మరింపుడు. నేను వెంటనే మీఆపదలను నశింప చేయుచున్నా"నని పలికెననిగలదు.

శ్రీ లక్ష్మి గౌరి సరస్వతుల కనురక్తులైయుండి వారి సహాయముచే బ్రహ్మవిష్ణుమహేశ్వరులను శ్రీదేవి గాయత్రియే కల్పించెను. కొన్ని సమయములయందు బ్రహ్మాదులు కార్యములు నిర్వహించ లేనపుడు తాను స్వయముగా కార్యములు నిర్వహించుచుండును. భండాసురుని వధించుటకు దేవతలును, బ్రహ్మాదులును అశక్తులగుటచే దేవియే అనేక స్త్రీ రూప శక్తి గణంబుల నుద్భవిల్లచేసి వారి సహాయముతో శ్రీగాయత్రి భండాసురుని వధించెను. అట్లేదుర్గా రూపంబు దాల్చి మహిషాసురుని పరిమార్చెను. ఆగాయత్రియే లలితా త్రిపుర సుందరియై పురుష రూపంబున కృష్ణుడై వేణుగానముచేత ప్రపంచకమును పరవశము చేసెను.

ఒకప్పుడా మహాశక్తియగు గాయత్రి తారయను పురుషరూపము దాల్చి రావణాది సంహారార్థమై శ్రీరాముడుగను, భైరవి నృసింహ మూర్తిగను కమలాదేవి మత్స్యమూర్తిగను, ఇట్లేవరుసగా ఆ ఆ రూపములతో వరాహ మూర్తిగను, వామనుడుగను, పరశురాముడుగను, కూర్మమూర్తిగను, ఆ గాయత్రిదేవియే అవతరించెనని కొన్నికొన్నిగ్రంథములలో గానవచ్చును.

శ్రీశంకరాచార్యులవారు శైవ వైష్ణవ మొదలగు మతములను ఖండించి జయము గాంచెను. అనంతరము శ్రీదేవిని యారాధించు మతమును కూడ ఖండించిరి. తదుపరి సాయంకాలము నిత్యవిధులు తీర్చుటకు నదికేగి అందలి జలంబున నిలుచుండి కృత్యములు తీరిన వెంటనె గట్టున కాలిడ ప్రయత్నింపగా కాలు

కదల్పలేకుండెను. అప్పుడు ఆదేవియే స్త్రీయై అనది కేతెంచెను. ఈమెవ్వరో స్త్రీయని గాంచిచేయూత కోరెను. "చేయూత ఎందుకని" ఆమె ప్రశ్నించెను. "పైకివచ్చుటకు నాకుశక్తిలే"దని శంకరులనిరి. అందుల కామె "శక్తిలేకుండుటయే నీయభిమతము కాదా," అనిన శంకరులు ఆశ్చర్యమొంది దివ్యదృష్టిచే ఆమె పరదేవతయగు గాయత్రియే అనితెలుసుకొని ఆమె పాదారవిందములకు మ్రొక్కి నూరు శ్లోకములచే గొనియాడెను. అప్పటినుంచి శ్రీశంకరులచే ద్విజులు నిత్యము ఉపాసించు సంధ్యాదేవియగు గాయత్రి వేదమాతగను, పంచముఖములుగల స్త్రీ దేవతగను ఆరాధింపబడుచుండెను. స్త్రీ రూపవ్యక్తికే యాధిక్యతగాని పురుషరూప వ్యక్తికిలేదు.

భండాసురుని సంహరించుటకు శ్రీదేవి గాయత్రి లలితారూపము దాల్చినప్పుడు దేవతలందరు పట్టాభిషిక్తురాలవు కమ్మని కోరిరి. అప్పుడు బ్రహ్మ పురుషుడులేని స్త్రీగాని స్త్రీలేని పురుషుడుగాని రాజ్యార్హులు కారని బ్రహ్మ ఆ లలితారూపము దాల్చిన లలితాంబికను "ప్రియుని చేపట్టుటవలన నీ స్వాతంత్ర్యమునకు భంగము కలుగదు. లోకసంహారార్థమై పురుషునొకని నంగీకరింపు"మనిన ఆమహాశక్తి సమ్మతించి కామేశ్వరుడను నామంబుననొక కోటి మన్మథ లావణ్యముతో గూడిన దివ్య శరీరముగల వానిని సంకల్పించిన మాత్రమున ఎదుట నిలువబడెను. అప్పుడు శ్రీదేవి ధర్మపాలనార్థమై స్వీకరించెను. బ్రహ్మాదులు కళ్యాణమహోత్సవములు సల్పిరి.

ఇట్టు పురుషరూపంబులు స్త్రీల విలాసార్థమై సృజింపబడెనేగాని స్వతంత్రములుకావు, పురుషరూపములన్నియు తుదకు స్త్రీ రూపములందే లయమొందును. అస్థిరమయిన జగమంతయు లయముకాగా స్త్రీ రూపమేయగు ఆమహాశక్తి అయిన శ్రీగాయత్రియే మిగులును.

స్త్రీలు సర్వవిద్యలందును సంపూర్ణాధికారులనుటకు ఎంతమాత్రము సందేహములేదు. దీనికి స్త్రీ దేవతయే నిదర్శనము. ఈ స్త్రీదేవత ఎవరు? ఆ మహాశక్తిచే సృష్టింపబడిన శ్రీ సరస్వతియే.

ఇట్లే స్త్రీలు భాగ్యభోగ్యములను అనుభవించుటకు కూడ భాగ్యదేవతయగు లక్ష్మియే గారణము. సమస్తవిషయములకును శ్రీమహాదేవి గాయత్రియే ప్రబలకారణమైయున్నది.

దేవీ భాగవతము నవమ స్కంధమున ఇట్లున్నది :

"కలియుగమున, పదివేలేండ్లకు అనంతరము ఎల్లరు స్త్రీపరాధీనులై స్త్రీలు గృహమునకు అధిపతులుగను, పురుషులు స్త్రీలకు భృత్యులుగాను ఉందురు."

కావున నా స్వాభిప్రాయమును బట్టి స్త్రీలు ఎంత స్వాతంత్ర్యము నొందినను పురాతన ధర్మవిరుద్ధముగ సంచరించరాదు. పాతివ్రత్యధర్మములను నీతిని విడనాడరాదు. పురుషులకు నిత్య దాసీలుగ నెంచుకొనుచు ధర్మబద్ధులై నడచుకొనవలయును. ఆలలితా స్వరూపిణియగు శ్రీదేవి, గాయత్రి ఎంత స్వతంత్రురాలయినను, లోక కళ్యాణార్థమై ధర్మమును సంరక్షించుటకై బ్రహ్మాదులు కోరిన విధమున పురుషుని తనభర్తగా స్వీకరించ లేదా? సర్వ విషయములకు ఆమెయే ఆధార మగుచు ఆమెనే ఆదర్శముగ గైకొని స్త్రీలు విహరింతురు గాక !!

—:o:—

# సంతోషం

శ్రీమతి ఇమ్మానేని చంద్రకాంతామణిగారు.



"అమ్మా! అమ్మా! నాన్నగారూ! నాన్నగారూ!"

(పరుగునవస్తూ) "యేమిటే? అట్లాపిలుస్తున్నావు?"

"వచ్చిందే! వచ్చిందే!"

"యేమిటే రాధా!"

"యేమిటే చెల్లీ!"

"అక్కయ్యా! నువ్వొ వచ్చావే? అబ్బ! యెన్నాళ్లకు వచ్చిందే!"

"యేమిటేఅదీ? చెప్పూ!"

"అబ్బా! అబ్బా! బలేసంతోషంగావుందే!"

"యేమిటే! చెప్పకుండా అట్లా గంతులు వేస్తున్నావు? త్వరగాచెప్పు, అవతల అన్నం వుడికిపోతూవుంది."

"ఉండవే అమ్మా!"

"రాధా! యేమిటమ్మా. అదీ! చెప్పూ! పోస్టువచ్చినట్టుందే. యేదీ చూడనియ్యి!"

"ఉండండి, నాన్నగారూ! నేనిచ్చేది చూడందేమీకు పోస్టుచేతికివ్వను, అబ్బ! వుండవే అక్కయ్యా! చేతిలోది లాక్కుంటున్నావు..ఆ..ఆ.."

"గృహలక్ష్మి పత్రికండీ నాన్నాగారూ!"

(యిద్దరూ ఒకేసారి) "గృహలక్ష్మి పత్రికా! అబ్బ! యెన్నాళ్లకు?"

"అక్కయ్యా! నేనుముందు చూస్తానుతేవే!"

"వుండవే రాధా! నన్ను ముందుచూడనీ!"

"అన్నం ఉమిడి ముద్దైపోతుంది; నాచేతికొక్కసారివ్వవే శారదా! నేను ముందుచూచి యిచ్చేస్తా!"

"యెవ్వరికీలేదు, నేను ముందుచూచి యిస్తానివ్వండి."

"నేను నాన్నగారిదగ్గర నిల్చొనిచూస్తా."

"నేనీప్రక్క నిలబడిచూస్తా."

"పోండి, మీఅమ్మలాక్కుంది నాచేతిలోది. మడి అంతా యేమై
పోయిందో?"

"వుండండీ! మళ్లీ ఒక చెంబెడునీళ్లు పోసుకుంటేసరి, మడికేం; ముందు
పుస్తకం చూడనివ్వరూ!"

"గృహలక్ష్మి పత్రిక అయినందుకు గృహలక్ష్మి పంతమే నెగ్గింది.
రాధా! అపోష్టు యిల్లాయిఖ్య, యింతలో పోష్టుఅయినా
చూస్తాను..... యిది నీవుత్తరం శారదా! అల్లుడు వ్రాసినట్లుంది"

"నాన్నగారూ! అన్నయ్యదగ్గర్నుండి కూడా వచ్చినట్టుందండీ జాబు."

"రాధా! మీఅమ్మనుపిలువు..... యిదిగో! చూడు, పూర్ణా! నాకు
ప్రమోషను వచ్చినట్లు ఆర్డరు వచ్చింది."

"మీ అల్లుడికి ఇన్‌స్పెక్టరు పని అయిందటండీ నాన్నగారూ?"

"నాన్నగారూ! అన్నయ్యను అమెరికాకు పంపడానికి సెలెక్టుచేశారట.
ప్యాసుపోర్టున్నూ వచ్చేసిందట."

"అన్నిశుభవార్తలూ ఒక్కసారివచ్చాయే! చిత్రంగావుంది సుమండీ."

"యిదంతా గృహలక్ష్మి పత్రిక మనింటికి వచ్చిన సమయపు ఫలితము."

"ఔను, నిజంగానే నాన్నగారూ!"

"అవును నాన్నగారూ!"

"సందేహం లేదండీ!"

"అట్లయితే యివేళ యేదైనా సంతోషచిహ్నంగా చేయండి."

"శారదా! ఆలోచించవే!"

"నీవు చెప్పవే రాధా!"

"మీరు చెప్పండీ నాన్నగారూ!"

"గృహలక్ష్మికి మాయింట్లో హారతిస్తామని నలుగుర్నీ పిలచి, పండ్లు,
తాంబూలం పంచిపెట్టండి."

"బాగుంది!"

"చాలా బాగుంది!!"

"తథాస్తు!!!"






## జైళ్ల ఇంటర్వ్యూలు.

జైళ్లలో ఉన్న అభాగ్యుల బంధువులు రూల్సుప్రకారం వారిని చూచి మాట్లాడడానికి వీలైన కాలంలో వచ్చి అధికార్ల అనుమతిని పొంది చూచిమాట్లాడవచ్చు. సామాన్యంగా ఇలాచూచే వారు మామూలుగా ఖైదీలకు భార్యాబిడ్డలే. ఆఇంటర్వ్యూలలో ఎన్నో అసౌకర్యాలున్నాయి. అన్నిటినీ ఇక్కడ వివరించడం సాధ్యం కాదు కాని ముఖ్యమైనవి మాత్రం ప్రస్తావిస్తాము. ఈ ఇంటర్వ్యూలు నడపడం ఇదివరలో ఇతరపనుల నిర్వహించే డిప్యూటీ జైలర్లే చేసేవారు. ఇప్పుడిందుకు ప్రత్యేకంగా డిప్యూటీ జైలర్లనేర్పరచి సౌకర్యాలను కూడా కలుగ చేయడానికి మదరాసు ప్రభుత్వం వారు నిర్ణయించారని వార్త ప్రకటనమైనది. కాబట్టి మేమీక్రింది సూచనలను చేస్తున్నాము ఈమాట్లాడు కోవడానికి రోజు మొత్తంమీద ఎప్పుడైనా సరే ఏర్పాట్లుఉండవలె. ప్రస్తుతం అడ్డంగా ఉండే రొమ్మెత్తుగోడలు. జంట తడికలు పోవాలి. ఖైదీగాని చూడవచ్చిన వారుగాని ఇతరులు వినకుండా మాట్లాడుకోడానికి అవకాశముండవలె. వాళ్లు భార్య భర్తలైనప్పుడు వాళ్లనడగనవసరం లేకుండానే, ఇంటర్వ్యూనడిపే డిప్యూటీజైలరు వినబడని దూరంలో నిలిచి ఉత్తరాలు, డబ్బుచేతులుమారకుండా మాత్రమే చూస్తుండాలి. ఆ సమయాన ఖైదీలకు స్వంత ఉడుపులు ధరింపనివ్వవలె. చూడవచ్చినవారే ఆబట్టలు తెస్తే వానిలో ఆక్షేపణీయమైన వస్తువులు లేవనే సంగతి సోదాచూచి వానినిధరింప నివ్వవలె. సభ్యతను మించని స్పర్శకు ఇష్టబంధువులకు అవకాశ మివ్వవలె. ఖైదీల బిడ్డలు వచ్చినప్పుడు వారినెత్తికొని లాలించ నివ్వవలె. చూడవచ్చిన వారేదైనా తినుబండారాలు తెస్తే డాక్టరు పరీక్షించిన మీదట, పరిమితంగా వారిఎదుటనే వాటిని తిననివ్వవలె. ఇప్పటికింత మాత్రంతో ముగిస్తాము. ఇంకా ఎన్నో చేయవచ్చు; చేయవలెను కూడ.

## పంజాబు అల్లరులు: కఠినమైన శాసనము.

పంజాబు మతకలహాలలో బంగాళముకన్న విరివిగా స్త్రీలను చెరబట్టడం, మానభంగ మొనర్చడం హత్యలు మొదలైన దురంతాలు జరుగుతున్నాయని కేంద్రసైనిక మంత్రి సర్దార్ బలదేవ్‌సింగుగారే అన్నారు. నేడు పంజాబులో కొన్నిప్రాంతాలనుతీవ్రమైన అల్లరులు జరిగే ప్రాంతాలుగా నిర్ణయించి ఆప్రాంతాలలో ఇలాంటి నేరాలను చేసేవారికి మరణదండనవిధిస్తామని ప్రభుత్వం ప్రకటించినది. మామూలుగా జరిగే ప్రజాప్రభుత్వంగాదిది; గవర్నరుగారి నిరంకుశ ప్రభుత్వము. ఉత్తరువులున్న చాలా కఠినమైనవి. మరణ దండన అసలు శిక్షాస్మృతిలోనుండి పోవాలనేవారు పలువురున్నారనే సంగతిని గమనించిన వారమే. అయితే స్త్రీలయెడ మతంపేరట జరిగే దురాచారాలు తలుచుకుంటే-ఇది

అవసరమని మాకుతోస్తున్నది. కాని ఈదండన ఒక్క స్త్రీలయెడల అత్యాచారాలకే ప్రత్యేకించితే మిగత నేరాలకు మామూలు శిక్షాస్మృతి చాలునని తలుస్తాము. ఈకఠిన శాసనాన్ని సాకుతీసుకొని ఉద్యోగులున్ను వెనుకటి మార్షల్ లా చర్యలకు దిగరనిన్ని భావిస్తున్నాము.

### అనుకొన్నంతపనీ అయినది!

శ్రీ ప్రకాశంగారి మంత్రివర్గము తొలిగినది. రెడ్డిగారి నూతన మంత్రివర్గమేర్పడినది. లోగడ మంత్రివర్గమున స్త్రీమంత్రిణి యుండెను. ఆమెనట్లే యుంచడం మంచిదనీ, కానిచో మరొక నారీరత్నమునైనా ఆస్థానమున నిల్పడం అవసరమనీ మేము ప్రధానసంపాదకీయమునందే వ్రాసియున్నాము. అట్లుజరుగలేదు. నూతన మంత్రి వర్గంలో మంత్రిణిలేదు. 13 గురున్నప్పుడే ఒకస్త్రీ మంత్రిణిగా యుండడానికి వీలుండగా, 15 కావాలన్నప్పుడు కూడ ఒకస్త్రీకైన స్థానంలేక పోవడం న్యాయంగాదు. స్త్రీలంతా దీనిని గర్హిస్తారు.

### సోవియట్ స్త్రీలు ఇకపై విదేశీయులను పెండ్లాడరాదు.

సోవియట్ ప్రభుత్వమువారు ఇకపై విదేశీయులను సోవియట్‌లోని స్త్రీలు పెండ్లాడకూడదని క్రొత్తగా ఉత్తర్వులు చేసినారట. అంతర్జాతీయ తత్వమును ప్రపంచమున సృష్టించినదే సోవియట్ ప్రభుత్వము వారనవచ్చును. చిరకాలము సోవియట్ రష్యాతో అస్పృశ్యత పాటించిన అమెరికా బ్రిటనులు, హిట్లరు పుణ్యమున నేడువారితో సఖ్యభావమున మెలగనేర్చినవి. ఉభయుల జాతీయ అంతర్జాతీయ దృష్టులలో బ్రహ్మాండమంత భేదమున్నది. అయితే ఆయా ప్రపంచసమస్యల, పరిష్కారమునకై యుద్ధమునకు మరలక, కూడి సంప్రతించుట అనే నాగరిక పద్ధతి నేటివరకు అవలంబింప బడుతున్నది. పంక్తి భోజనము, బాంధవ్యము-ఈరెండును సమరసముగా ఆలోచనలు, చర్చలు-పరిణమించుటకు ముఖ్యసహాయకారులు. సంపర్కమున బాంధవ్యము తప్పనిసరిగా అవుతున్నది. యుద్ధకాలంలో చాలమంది సోవియట్ స్త్రీలు, బ్రిటిష్ దేశీయులను అమెరికనులను వివాహం చేసుకొన్నారట. కాని యింకనువారిలో పలువురికి ఆదేశమునుండి భర్తృదేశాలకు కాపరంచేయ వెళ్లుటకు అనుమతి కలుగలేదట. రష్యాలో స్త్రీపురుషులకందరికీ విద్యావైదుష్యములు సమానములే. దేశీయవృత్తులు యంత్రపరిశ్రమల యందు నేర్పరితనమును సామాన్యమే. ఇట్టివివాహములవల్ల శాస్త్రజ్ఞులు ప్రవీణులగు స్త్రీలు విదేశములపాలైన సోవియట్ దేశపు ఆర్థికవిజ్ఞాన సౌష్టవమునకు భంగకరమని ప్రభుత్వమునకు ఆలోచనయేమో. అయితే క్రొత్తవారిని తయారొనర్చుకొనవలెను. జనాభానిరంతరము పెరుగును లేదా తరుగును. కాని నిలకడగా ఉండదు. అంతేగాని స్త్రీపురుషులకు సహజముగాగల వివాహస్వాతంత్ర్యమును అరికట్టరాదు. తనకులములోనే వివాహమొనర్చుకొనవచ్చుననే హిందూసనాతన ధర్మావలంబి ఆచారమునకును-ఈసోవియట్ ఉత్తరువునకు భేదమేమున్నది?

### హిందూ లా కమిటీ రిపోర్టు.

హిందూ లా యందు చెదిరి ఉన్న వివిధమైన హంశాలను క్రోడీకరించి ఒకచట్టంగా చేయడానికి ఏర్పడిన కమిటీవారు స్త్రీసమస్యల యెడలచూపిన ఔదార్యమునకు స్త్రీలందరు కృతజ్ఞులై యుండగలరు.

పిత్రార్జితములో కొడుకుతోపాటు కూతురుకిన్ని భాగమేర్పడినది. కొడుకు భాగంలో సగం కూతురికి చెందవలెనన్నారు. తల్లి ఆస్తిలో కుమారుని భాగానికి రెండురెట్లు కూతురికి చెందవలెనన్నారు. స్త్రీకి ఆస్తి పైగల హక్కు ఇంతవరకు పరిమితము. ఆచిక్కు తొలిగించి ఈ కోర్టులో సంపూర్ణమైన హక్కు నేర్పరిచారు. ఆస్తివిషయంలో స్త్రీకి సంపూర్ణమైన ఆర్థికస్వాతంత్ర్యము ఏర్పరచడంవల్ల సాంఘికంగా ఆమె స్థితిలో ఎంతో మార్పుకలగడానికి చాలా అవకాశముంది. స్త్రీసంఘాలకు తగిన సన్నాహంతో కృషిచేస్తే ఈ హక్కులు సద్వినియోగమై స్త్రీల జ్ఞానాభివృద్ధికి, విజ్ఞానాభివృద్ధికి, మూలంకాగలవు. వివాహవిషయంలో వీరు చాలా మార్పులు సూచించారు. కొన్ని పరిస్థితులలో విడాకులివ్వడానికి అవకాశం కల్పించారు. నిష్కారణంగా భార్యాభర్తలలో ఎవరైనాసరే ఒకరినొకరు 5 సం|| లకు తక్కువగాకుండా వదిలివేయడం, చిరకాలము పిచ్చివారైయుండడం, పరస్పరం కలిసిఉంటే ప్రమాదకరమని అనుమానం కల్గడం అని అట్టి అవసరములను వివరించిరి. వెనుక విడాకుల పద్ధతి అవసరమా అనిచర్చించుటకు సంపూర్ణమైన అవకాశ మిచ్చియున్నాము. లౌకికముగా అదిసమ్మతమే యైనను, పారమార్థికంగా హిందూ స్త్రీల నైజమునకది ప్రబలమైన విరుద్ధమేమోయని మా అభిప్రాయము. అయితే అత్యంతావసరములైన సన్నివేశము లున్నా సంభావ్యములే అనవచ్చు. ఈకమిటీవారు తాము ఈసందర్భంలో చేసినసూచనలు కేవలము అనుమతినిచ్చేవిగాని, నిర్బంధంగా ఆచరింపవలసినవి కాదనిన్నీ, వీటిని సాకుగా తీసుకొని దుర్వినియోగం చేయరని ఆశిస్తున్నామని చెప్పడం సర్వజనామోదకరము. స్త్రీ ఆర్థిక సాంఘిక స్వాతంత్ర్యము చేకూరే కొద్దీ-దేశాభ్యుదయానికి ఆమెహెచ్చుగా తోడ్పడుటవల్ల అంతకన్న ఆమెకారెండున్నూ హెచ్చుగా సంప్రాప్తము కాగలవని మావిశ్వాసము.

## శాసనసభ్యురాండ్రకు ప్రత్యేకవసతి.

శాసనసభా భవనంలో గంటలకొద్దీ శాసనసభ్యు లుండవలసి వస్తున్నది. మధ్యవిరామ కాలంలో ఇంటికిపోయి రాదగినంత సావకాశంగాని ఓపికగాని వారికుండదు. అందుచేత పురుషులు అక్కడనే, అలసటచే వాడిన ముక్కు మొగము కడుగుకొని, ఫలహారములు భోంచేసి మళ్లీ సభారంగానికి తయారు కావడానికి ఏర్పాట్లు ఉన్నవి. సభ్యురాండ్ర విషయం వేరు. వారు కేవలం ముఖము కడుక్కుంటే చాలదు. వారింకా కొంతసింగారించుకొను ఏర్పాట్లు ఉండవలెను. అందుచేత ప్రత్యేకముగా స్త్రీల కుపయుక్తంగా వారి కవసరమైన అన్నియేర్పాట్లుతో గూడిన ప్రత్యేక గది వారి కవసరము. అట్టి ఏర్పాట్లు చేయవలయునని సిఫారసు చేసిన మద్రాసు శాసనసభవారి గృహోప సంఘమువారిని అభినందించుచున్నాము. సభ్యురాండ్రకేకాదు. ప్రేక్షకులుగా వచ్చే స్త్రీలకుకూడా ఆవసరముల తీర్చే ఏర్పాట్లుండ వలయును. వారిని ఆదరించడానికి సభాధిపతి ప్రత్యేకం తమసిబ్బందిలో ఒకరిద్దరు ఆడువారి నుద్యోగులుగా ఏర్పరచడం అవసరం.

—:o:—

# శ్రీ సర్వజిత్సంవత్సర గృహలక్ష్మి పంచాంగం.

| | | | |
|---|---|---|---|
| రాజు | సూర్యుడు | సస్యాధిపతి | గురుడు |
| మంత్రి | చంద్రుడు | రసాధిపతి | శుక్రుడు |
| సేనాధిపతి | సూర్యుడు | నీరసాధిపతి | బుధుడు |
| మేఘాధిపతి | సూర్యుడు | పశునాయకుడు | యముడు |
| అర్ఘాధిపతి | సూర్యుడు | స్థానరక్షకుడు | యముడు |
| ధాన్యాధిపతి | కుజుడు | వర్షస్వామి | బ్రహ్మ. |

సూర్యుడు రాజగుటచే అతివృష్టి అగ్నిభయములు. సేనాధిపతి యగుటచే ఎఱ్ఱధాన్యములు బాగా పండును. అర్ఘాధిపతి యగుటచే ధరలుతగ్గును. మేఘాధిపతి గావున ధరలుతగ్గును. చంద్రుడు మంత్రి యగుటచేత పంటలు బాగాపండును. సస్యాధిపతి గురుడగుటచే పంటలు బాగాపండును. రసాధిపతి శుక్రుడగుటచే మంచి వర్షములుకురిసి రసవర్గములు వృద్ధియగును. ధాన్యాధిపతి కుజుడు గావున తోటధాన్యములు, ఎఱ్ఱ ధాన్యములు బాగాపండును. నీరసాధిపతి బుధుడగుటవల్ల రత్నాదులకు వృద్ధి, ఫల ధాన్యములకు వృద్ధి. పశునాయక, స్థానసంరక్షకులు యముడగుటచేత, అతివృష్టి, స్వల్ప క్షీరం, స్వల్ప తృణం-పశు పీడ.

ఈ సంవత్సరమున శ్రావణమాసము అధిక మాసముగా కూడకలదు.

అధిక శ్రావణశుద్ధ 13 లు మొదలు భాద్రపద బహుళ 12 లు వరకు శుక్రమూఢమి.

కార్తికశు 3 లు మొదలు మార్గశీర్ష శుద్ధ 4 లువరకు గురుమూఢమి.

## చంద్ర గ్రహణం

జ్యేష్ఠశు 15 లు మంగళ్వారమున చంద్ర గ్రహణము. కొంచంతక్కువగా 3 వ భాగము బింబము గ్రహింపబడును. గ్రహణం రాత్రి 11-17 గంటలకు ప్రారంభమై గం 1-2 కు విడుచును.

ముక్కోటి ఏకాదశి ఈడిశంబరు 24 వ తేదీన మార్గశీర్షమాసముననే వచ్చును.

## మకర సంక్రాంతి

పుష్యబ 3 లు బుధవారమున అపరాహ్ణానంతరం మకర సంక్రాంతి పుణ్యకాలం.

## మహోదయ పుణ్యకాలం

ఈ సం || ము పుష్యబ 30 సోమవారము శ్రవణా నక్షత్రము వ్యతీపాతయోగము కావున మహోదయ పుణ్యకాలము. ఈ పుణ్యకాలమున స్నానదాన జపాదులు చేయడం ఉత్తమం. సముద్రస్నానం అత్యుత్తమం. రామేశ్వరంవెళ్లి సేతువున స్నానంచేస్తే పునర్జన్మ లేదు—అని శాస్త్రము చెప్పుచున్నది.

## వివాహాదులకు ముహూర్తములు

చైత్ర బ 1 లు ఆదివారం, బ 6 లు శుక్రవారం, మాఘశు 4 లు శనివారం, శు 10 లు శుక్రవారం, బ 2 లు గురువారం, ఫాల్గుణశు 2 లు శుక్రవారం-ఉత్తమమైన వివాహాది ముహూర్తములు.

# లోకం పోకడలు

బ్రిటిష్ సామ్రాజ్యానికి చక్రవర్తి, వారిపట్టమహిషి సింహాస నానికి వారసు రాలైన రాజకుమార్తె దక్షిణాఫ్రికా చూచిరానువెళ్లినారు. వాళ్లక్కడ తమాషాలు చూస్తూ పొద్దు పుచ్చుతున్నారనుకోకండి. ప్రపంచంలో వర్తకం పంచుకోవడానికి ఆంగ్లఅమెరికా దేశాలకు తీవ్రమైన పోటీగాఉన్నది. ఆపోటీ తమకు లాభసాటిగా ఏర్పడడానికే సామ్రాజ్యదేశాలలో "ఇంపీరియల్ ప్రిఫరెన్సు" తీసివేయమంటున్నారు అమెరికావారు. అయితే ఈ బ్రిటిష్ రాజపత్ని, రాజకుమార్తె దక్షిణాఫ్రికాలో చేస్తున్నపని చూచారా? బ్రిటిష్ పెట్టుబడితో దక్షిణాఫ్రికాలోనే తయారు చేయబడుతూ బ్రిటిష్ పేర్లతో పిలువ బడే గుడ్డలు, బూట్సులు "అబ్బా, ఎంతఅందంగా ఉన్నవి" అని మురిసిపోతూ కొంటున్నారు. దానితో దక్షిణాఫ్రికా వాసులంతా వాటికే ఎగబడు తున్నారు. చక్రవర్తిని, ఆమె కుమార్తె అంగీకరించినది అందానికి మేర. ఈ మెళకువ తెలుసుకొని ఒక దక్షిణాఫ్రికా వర్తకుడు లండను వెళ్లి రాచవారు కొన్నమోస్తరు గుడ్డలు అసలు బ్రిటిష్ సామగ్రినే దిగుమతి చేయటానికి బేరం చేస్తున్నాడు. దక్షిణాఫ్రికా మార్కెట్టు అరచేతిలోకి వస్తున్నదని ఆశ పడుతున్న అమెరికావారిఆశ అడుగంటినవి. ఊరకన్నాడా నెపోలియన్ "ఆంగ్లేయులు-దుకాణా దార్ల జాతి" అని!

★ ★ ★

యుద్ధంరోజులలో భారత దేశంలో యూరపియన్ అధికార్లకు—అదీ సైనికాధికార్లకు-రాజోపచారంగా వెళ్లిపోయింది. గత నవంబరులో ఒక వైమానిక శాఖోద్యోగి అతని భార్య ఇంగ్లాండుకు వెళ్లారట. ఇక్కడికి అక్కడికి బ్రతుకు చాలా తేడాకన్పించగా అక్కడ సుఖ జీవనం దుర్లభమని తోచి అతని భార్య 34 ॥ల యువతి విసికి ఉరిపోసు కొని చచ్చిపోయిందట!

★ ★ ★

మదరాసులోనే జి. కృష్ణయ్యచెట్టి అనే నగలవర్తకుడు అతని భార్య శకుంతలమ్మ శీలమును శంకించి ఉగ్ర ద్రావకములతో గాయపరచి గదిలోపెట్టి రెండురోజులు తాళంవేసి ఉంచినాడట. ఆనేరానికి విచారణచేసి, ప్రెసిడెన్సీ మ్యాజిస్ట్రేటు గారతనికి 3 నెలలు కఠిన నరకము, రు 250-లు జుల్మానా వేసినారు. అందులో రు 150 లు ఆవిడ కిమ్మన్నారు.

★ ★ ★

విమానాలలో హఠాత్తుగా నిప్పంటు కోవడం కలదు. అట్లాఅంటుకొని వళ్లుకాలి-నేతాజీ మరణించె నని కదా గాధ. అందుచేత అంటుకోని గుడ్డలు తయారు చేయడానిని గూర్చి లండన్‌లో వైమానిక శాఖ వారు పరిశోధనలు సాగించారు. ఆఖరుకు ఆలాంటి గుడ్డలు తయారుచేయడం కనిపెట్టారుట. ఉతికినా, ఎండకు ఆరవేసినా- ఆగుడ్డలు చెడిపోవట. కుంపట్లమీద పొయిలమీద వంటచేసే మనదేశంలో స్త్రీలకు చాలా అవసరంకదా ఈ గుడ్డలు!

## కీ॥ శే॥ తలిశెట్టి రామారావుగారు.

### సానుభూతి.

ఈనెల 14 వ తేదీని జయపురంలో తలిశెట్టి రామారావుగారు స్వర్గస్థులైనారు. వీరు వ్యంగ్య చిత్రాలు చిత్రించడంలో ఆంధ్రదేశాన ప్రారంభకులనవచ్చును. ఆకళానైపుణ్యంలో చాలా పెద్దపేరు సంపాదించినారు. "గృహలక్ష్మి" తొలిసంవత్సరాలలో చిరకాలం వీరి వ్యంగచిత్రాలను ప్రకటించినది. వీరి అకాల మరణమునకు చింతిల్లుచు వీరికుటుంబానికి మాసానుభూతి తెలియ జేస్తున్నాము.

# స్వీకారము-విమర్శ

## అష్టపది_దశావతారాలు.

"పద్మావతీ చరణ చారణ చక్రవర్తి" యైన జయదేవకవీంద్రులు భావరాగతాళబద్ధమైన సంస్కృత గీతాలుగా, రాధాకృష్ణుల ప్రేమగాథలను, భక్తిభావముట్టిపడేట్లు, అష్టపదులనే పేరట పూర్వం రచించినారు. వానిలో ఒకటైన "దశావతారాల"ను గూర్చిన అష్టపదిననుసరించి "కవిసామ్రాట్" పైడిపాటి సుబ్బరామశాస్త్రిగారు (బెజవాడ) తెనుగులో నృత్యయోగ్యంగా దీనిని రచించారు. ఈరచన మృదుపదలలితమధురమై సహృదయులు మెచ్చదగినదిగా ఉన్నది. పుస్తకము చిన్నదైనా-సుందరంగా తయారు చేయబడినది. వలయువారు శ్రీ శాస్త్రిగారికే బెజవాడకు వ్రాయండి.

## శ్రీమతి కమలానెహ్రూ (జీవితం)

సుప్రసిద్ధ నారీశిరోమణియగు శ్రీమతి కమలానెహ్రూగారి జీవితం పొందుపరుప బడిన చిన్న గ్రంథము. ఇది వచనమే. శ్రీ పి. శ్రీనివాసరావు బి. ఎ. గారు గ్రంథకర్తలు. గ్రంథవస్తువు సుప్రసిద్ధము; ఇదివరకే పలుగ్రంథములలో రచింపబడినది. చరిత్ర చక్కగా క్లుప్తపరుపబడినది. నెహ్రూకుటుంబంలో ఎవరి చరిత్ర వ్రాయ బూనుకున్నా భారతస్వాతంత్ర్య సమరచరిత్రలో గత 25సం॥ ల భాగమున్నూ సూత్రప్రాయంగా చెప్పవలసినదే. ఆవిషయంలోను గ్రంథకర్త లోపం చేయలేదు. శ్రీరావుగ్గారు గ్రంథము ఆద్యంతమున్నూ శ్రీమతి 'కమల' అని కుటుంబ చిహ్నమైన 'నెహ్రూ' అనేది విడిచివ్రాశారు. ఔత్తరాహులు-మనవలె గాక పాశ్చాత్యుల వలెనే కుటుంబ నామధేయంచేత పిలువబడడమే మర్యాదగా భావిస్తారు. ఎవరో ఆంతరంగిక మిత్రులున్నూ, అనురాగపూరితులగు సమీప బంధువులున్నూ దక్క అసలు పేరున పిలువరు, వ్రాయరు అనివిందుము. అసలుపేరున పిలువబడు మర్యాద ద్రావిడ భాషలమాట్లాడే మనకే. తమిళ తెలుగు, కన్నడ, కేరళాలకే అలవాటు. ఈగ్రంథంలో శీర్షికలోను, గ్రంథమధ్యమందక్కడక్కడ-"నెహ్రూ" పదమందలి-'ఉ' కారపుకొమ్ము, వట్రువసుడి-రెండూ జోడించడం; రచయిత పొరపాటో అచ్చుపని వారలతప్పో-తెలియదు. వలయువారు: లాల్ పబ్లికేషన్స్, బెజవాడ అనివ్రాయండి. వెల రు. 0-4-0 మాత్రమే.

## ప్రకృతి వైద్యము.

విమర్శనార్థమీ గ్రంథాన్ని మాకార్యాలయాని కంపిన ప్రకాశకులకు కృతజ్ఞులము.

ఈగ్రంథము గుంటూరుజిల్లా రేపల్లెతాలూకా మోర్తోటగ్రామములోని శ్రీ యోగాశ్రమమువారు తమ ఆశ్రమవిశేషముంగూర్చి ప్రచురించినది. ఈ ఆశ్రమమున శ్రీరాఘవేంద్ర యోగీశ్వరులు అచ్చటికి వచ్చి ఉండి వైద్యంచేయించుకొనే రోగులకు ప్రకృతి చికిత్స చేస్తారు. ఆవివరములను ఇందువ్రాశారు. అయితే ఆవిషయమంతా క్లుప్తంగా 18 పుటలలో ముగిసింది. మరి 40 పుటలలో ప్రముఖులు వీరివైద్యవిధానమును గూర్చి గద్యపద్యాత్మకమగు ప్రశంసలగావించి వ్రాశారు. ఆపిదప 100 పుటలకుపైగా ఈ ఆశ్రమమున చికిత్స పొంది రోగవిముక్తులైనవారు తమతమ అనుభవములను విపులముగా వ్రాసినారు. ఇట్లువీరు విముక్తిపొందిన రోగములలో కుష్టు, మూర్ఛ, క్షయ, పాండు, సుఖవ్యాధులు, మున్నగు మొండిరోగములున్ను కలవు. ఈగ్రంథము వెల 0-8-0 మాత్రము. వలయువారు శ్రీయోగాశ్రమమునకు వ్రాసిన బడయగలరు.

# మహమ్మద్ ఇబ్రహీం & కో.

## ஆனந்தமாய் அனுபவியுங்கள்

### ప్రకటన

దయచేయుడు    వినుడు

శ్రావ్యగానము

తెలుగు, అరవము, ఇంగ్లీషు

రికార్డులు

ఆనందించండి    అభిమానముంచండి.







## முகம்மத் இப்ராஹிம் & கோ

గ్లోబు హవుస్, 2/18c, మౌంటురోడ్డు, మద్రాసు.

KITTU'S